బోజ : కథలు

మొదటి ముద్రణ : 1996
ప్రతులు : 2000



ప్రచురణ :
సాహితీ మిత్రులు.
ముద్రణః సాయి స్పందన ప్రింటర్స్
తిలక్‌నగర్, హైద్రాబాదు

ప్రతులకు :
బి. చేతన్
ప్రగతి పబ్లిషింగ్ హౌజ్
5-7-68 / E2, మాన్యంచెలుక
నల్లగొండ - 508 001.
ఫోన్ : 32515

మరియు

విశాలాంధ్ర పబ్లిసింగ్ హౌజ్
బ్యాంక్ స్ట్రీట్ హైద్రాబాద్
వెల: 40 /-

"ఏది దళిత సాహిత్యం-
ఎవరు రాసింది దళిత సాహిత్యం"-
చర్చ జరుగుతున్న తరుణంలో
అసలు సిసలు దళిత కథలు ఈ
'చీమలు' కథలను మీముందుంచుతున్నాం
మంచిగ అనిపిస్తే - మరొకరికి చెప్పండి
లేదా మాకే రాయండి.
ఆలోచనమాది -ఆదరణ మీది

—సాహిత్య మిత్రులు. నల్లగొండ

- ఈ కథలను క్రితంలో ప్రచురించిన
ఆంధ్రజ్యోతి, రచన
ఆంధ్రప్రభ, ఇండియాటుడే
సాంపాదకులకు

- ముఖచిత్రం గీసిన
శిలావిగార్కి

- సంకలనం తేవడానికి ఆర్థికంగా
సహకరించిన మిత్రులందర్కి

- ప్రచురించిన సాహితీ మిత్రులకు

నా కృతజ్ఞతలు

బోయ జంగయ్య
చేతన కాటేజ్
నల్లగొండ
**508 001**

నా భార్య లక్ష్మికి

— బోజ

# ఇందులో....

## మా కథ

పాతికేళ్ళ క్రితం నల్లగొండలో ఏకాభిప్రాయంగల కొందరం కలిసి "సాహితీ మిత్రులు, నల్లగొండ" అనే సంస్థను స్థాపించాం. సాహితీ సమావేశాలను నిర్వహించడం, సాహితీ మిత్రుల రచనలను, కథలను సంకలనాలుగా ప్రచురించడం, మా సంస్థ యొక్క ఉద్దేశ్యాలు

## మా ప్రచురణల కథ

**1970** ఆ ప్రాంతంలో మొదట "దర్పణం" త్రైమాసిక పత్రికను వెలువరించాం. దానికి శ్రీ కాంచనపల్లి చిన వెంకట రామారావు గారు సంపాదకులు.

ఆరోజుల్లో ఆ పత్రిక చాలా మందిని ఆకర్షించింది. సంచలనాన్ని సృష్టించింది.

1980లో "గొర్రెలు" కథా సంకలనాన్ని ప్రచురించాం. ఈ పుస్తకం కౌలాలం పూర్‌లో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభ నుండి విడుదల చేయబడటం, అక్కడి తెలుగు సోదరుల మన్ననలను పొందటం అనుకోకుండా లభించిన ఓ మంచి అవకాశం. దీనిని ఉస్మానియా విశ్వవిద్యాలయం వాళ్లు ఎం.ఏకు పాఠ్యాంశంగా పెట్టారు.

ఆ తర్వాత 1983 "ఎచ్చరిక" కథలను ప్రచురించాం. ప్రముఖ పత్రికల, కొన్ని సమీక్షలను మీ ముందుంచు తున్నాం.

"ఈనాటి వాస్తవికతకు ముఖ్యంగా తెలంగాణా గ్రామాల్లో జరుగుతున్న ఘోరాలకు ఈ కథా సంకలనం ప్రతిబింబం అభూత, అసందర్భ కల్పనల్లోంచి, అవాస్తవిక ప్రపంచంలోంచి, దయ్యాల, భూతాల క్షుద్ర సాహిత్యంలో నుండి తెలుగు రచన బయటపడి పునర్జీవించడానికి ఇలాంటి సంకలనాలు ఎన్నైనా రావాలి.

**భారతి, మాసపత్రిక**

"కథల్లో జీవిత చిత్రణ ఉంది. ఓ లక్ష్యం, ఓ సూత్రం రన్నవుతుంది. ఈ వ్యవస్థలో ఎవరైతే బాధపడుతున్నారో వాళ్ళ బాధల్ని యాక్చువల్‌గ రాశారు అని రా.వి.శాస్త్రిగారి సర్టిఫికేట్ అందుకున్న జంగయ్య గారి కథలను ప్రచురించిన సాహితీ మిత్రులు అభినందనీయులు.

**—ఈనాడు దినపత్రిక**

మీ(రాసిన "ఎచ్చరిక" చూచాను. (గామీణ జీవితంలో సంఘటనలు ఆనాటి పోరాటాలు గడిచిపోగా, ఈనాడు సమాజంలో చిన్న చిన్న వర్గాలు అనుభవిస్తున్న అవస్థలు సామాజిక పరివర్తనలో అనుదినం అనుభవిస్తున్న కష్టాలు కళ్ళకు కట్టినట్లుగా చూడగలిగాను. చదివాను.

అభినందనలతో

సత్తైన పల్లి

28-8-85

—వావిలాల గోపాల కృష్ణయ్య

ఈ ఎచ్చరిక కథలకు 1984 లో శ్రీ శ్రీ స్మారక బంగారు పతకాన్ని నాగార్జున విశ్వ విద్యాలయం వాళ్ళు బహూకరించారు. అప్పటి నుండి మా కథలు బంగారు కథలయ్యాయి. ఆ తర్వాత 1985 లో వెలుతురు కవితా సంకలనాన్ని (పచురించాం.

"జూన్ 1976 లో బోయ జంగయ్య కవితా సంకలనం, 'నడుస్తున్న చరి(తను' సొంతం చదివి సంతోసించాను. నడుస్తున్న చరి(తలోని ఖండికలు పద్దెనిమిది, పుటలు ఇరవై, ఆనాడే అన్నాను వ్యాసుని నాటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలు, నేటి మహాకావ్యం పద్దెనిమిది పుటలు అన్న శ్రీశ్రీ మాటకు 'నడుస్తున్న చరి(త' జంగయ్య కవితా సంపుటి నిదర్శనమని, నాకట్లా అనిపించింది.

ఈనాడు "వెలుతురు", చిందిస్తూ జంగయ్య మరో కవితా సంకలనం మన ముందుకు వస్తున్నది. వెలుతురు జాడగని నా గొడవ కొక్కొరకో అంటున్నది.

హనుమకొండ

— కాళోజి

ఇన్నాళ్ళుగా కధలు నడిపిన జంగయ్య ఇప్పటికి కవితా సంపుటి తీసుకొస్తున్నాడు ఈ సంపుటిలో వున్న చాల కవితలు ప్రత్యక్షంగా చూసిన సత్యానికి కట్టిన చిత్రాలు

కధా రచనలో జంగయ్యకు బలమైన గొంతు ఏర్పడింది కవితల్లో కదిలించే గుండె కదను తొక్కింది. పలుకూ పదును కాపాడుకుంటూ జంగయ్య మరిన్ని చక్కని కవితలు వ్రాయాలని కోరిక. బోయ జంగయ్య 'వెలుతురు' కు ఇదే నా ప్రసరణ

19-2-86 — సి. నారాయణ రెడ్డి

హైదరాబాదు — వైస్ ఛాన్సలర్,

తర్వాత 1988 లో "జాతర" నవలను ప్రచురిస్తే, దానిని మైసూరు విశ్వ విద్యాలయం వాళ్ళు బి ఏ. బి.ఇడి కి ఉపవాచకంగా ఎంపిక చేశారు. అంతేకాదు తెలుగు విశ్వవిద్యాలయం వారు 1989 సం॥పు ఉత్తమ నవల అవార్డును గూడ బహూకరించారు. దానికి ముందు మాట రాస్తూ -

"జీవితం గురించి బాగా తెలిసి రాసే అరుదైన రచయితలలో బోయ జంగయ్య గారు ఒకరు. 'జాతర' నవల ఆయన ప్రతిభకు ఒక మచ్చుతునక.

ఇందులో సిద్ధాంతాలు, స్లోగన్లు, చర్చలు వాదోపవాదాలు ఏమీ లేవు. కధ ప్రవాహ సదృశంగా సాగిపోతూ జీవిత సత్యాన్ని ఆవిష్కరించి మూఢ నమ్మకాలను పటాపంచలు చేస్తుంది. అంతకంటే సాంఘిక ప్రయోజనం ఏమికావాలి? రచయిత స్థిత ప్రజ్ఞులు. దేన్ని ద్వేషించడు. ఎవర్నీ తిట్టడు, ఉన్నది వున్నట్లు చెప్పాడు, వీరైతే కాదు, తప్పకుండ మన

సమాజం ఇటువంటి దురన్యాయాల నుండి, దుష్టసంప్రదాయాల నుంచి బయటపడాలన్న సందేశం కథ చదివాక మనలో కలుగుతుంది. జంగయ్యగారు. మంచి కథకుడు"

– పురాణం సుబ్రహ్మణ్య శర్మ

విశిష్ట రచన

కొన్ని మంచి పుస్తకాలను చదువుతున్నపుడు చూపులు పంక్తుల వెంట పరుగెడుతున్నాయని, పేజీలు తిప్పుతున్నామని మనకు స్ఫురించదు. సాక్షాత్తుగా యదార్థ జీవిత దృశ్యాలను చూస్తున్నట్లే ఉంటుంది 'జాతర' నవల అలాంటిది. రచయిత తీసుకున్నది నల్లగొండ జిల్లాలోని గ్రామీణ ప్రాంతం. ఆయా ప్రాంతాల పాలిటి చీకటి గది లాంటి ఆ ప్రాంతంలో 'స్విచ్' చేయగానే వెలిగిన దీపంలా 'జాతర' నవల వెలువడింది. అక్కడి ప్రజా జీవనం దాని మంచి చెడ్డలతో నిమ్నోన్నతాలతో, మేలు కోళ్ళతో దృశ్యమానమైపోయింది. మంచి సాహిత్యానికి కింతకంటే కావలసిందేముంది?

అటు సామాజిక విషయ పరిజ్ఞానమూ ఇటు సాహిత్య మర్మజ్ఞత సమపాళ్ళలో మేళవించిన విశిష్ట రచన 'జాతర'

– మధురాంతకం రాజారాం.

"జానపదుల అసలైన సిసలైన హృదయం తెలిసిన రచయిత శ్రీ బోయ జంగయ్య, వారి ప్రతి రచన జానపదుల హృదయాలకు నిలిపిన నిలువుటద్దం.

సెప్టెంబర్ 1988
హైద్రాబాద్

తూమాటి దోణప్ప
వైస్ ఛాన్సలర్, తెవి.

1990 ఆగష్టులో మొదటి ముద్రణ, అక్టోబరులో రెండవ ముద్రణ పొందిన ఈ కథా సంపుటి పరిచయ వాక్యాలు రాస్తూ, 'తెలంగాణా గ్రామీణ వ్యవస్థ, సమస్తమైన దాని లక్షణాలతో, అందులో జీవించే దున్నలతో, గొర్రెలతో, నక్కలతో, తోడేళ్ళతో ఈయన కథలు దర్శనమిస్తాయి. - అన్నారు ప్రముఖ రచయిత డి. రామలింగం.

కథని అల్లడంలో నేర్పు, చెప్పడంలో చాతుర్యం, చదివించడంలో కౌశలం, యితివృత్తంలో నవ్యత, చిత్రణలో రసస్ఫూర్తి గల ఉత్తమ కథా రచయిత బోయ జంగయ్య.

జగతి — దయానిధి

●

సాహితీ మిత్రులు

---

# ఇది కతా ?

అది జిల్లా కేంద్రం కాబట్టి జనం రాకపోకల రద్దీ. రోజుకు నాలుగు ఆటల సినిమాల సందడి, హెూటళ్ళ హెూరు, పోలీసుల హడావిడి, ఇంకా ప్రభుత్వ కార్యాలయాలకు వచ్చిపోయే జనం. వీటన్నిటిని చూసిన మల్లయ్యకు "ఇంత మంది బతికే ఈ పట్టణంలో తాను గూడ తప్పక బతకొచ్చు" అన్న నమ్మకం కుదిరింది

ఓ చౌరస్తా కార్నర్‌లోని పెట్రోల్ బంక్ పక్కమ్మటె తన అడ్డా జమాయించి కూర్చున్నాడు అతని చుట్టూరా అతని పనిముట్లు ఓ పాత రేకు డబ్బాలో చెప్పులకు కొట్టే మొలలు దాని పక్కనే మూత తీసేసిన నల్లని పాత బ్యాటరీ డబ్బాలో నీళ్ళు. రిపేర్ల కోసమని కొన్ని తోలు పేలికలు, పాలిష

డబ్బాలు, దారం, మైనం వగైరాలన్ని సర్దిపెట్టుకున్నాడు పాలిష్ చేయడం ఇక్కడి కొచ్చినాకనే నేర్చుకున్నాడు.

దసరా పండుగ రెండు రోజులుందనంగా స్కూళ్ళకు సెలవులిచ్చారు. కార్యాలయాలు గూడా సరిగ్గా నడుస్తున్నట్టు లేవు అందువల్ల ఇద్దరో, ముగ్గురో వస్తున్నారు

మిట్ట మధ్యాహ్నం గోడ నుండి గుంజికట్టిన బస్తా నీడలో కూర్చున్న మల్లయ్యకు రేపు పండుగనాడు కూడా వస్తు ఉండాల్సి వచ్చేట్టుగ ఉందనిపించేసరికి ఒళ్ళంతా తేలిపోయి నట్టనిపించింది చుట్టూ చూసి అంతకుముందెప్పుడో సగం కాల్చి చల్లార్చి దాచుకున్న చుట్ట ముక్కను తీసి వెలిగించుకున్నాడు

ఈ పీల్చిన పొగైనా కడుపులో ఉండిపోతే బాగుండు, కాస్త ఆకలి కాకుండా ఉండేది. ఇదీ మళ్ళీ బయటికెళ్ళి పోద్ది, అనుకుంటూ ఎడమ చేత చుట్టను పట్టుకొని దాన్నే చూస్తూ ఉండిపోయాడు అలా చూస్తున్న మల్లయ్యకు తన ఊరు జ్ఞప్తి కొచ్చింది. ఊరితో పాటు తన తల్లి, తండ్రి, అప్పటి తన బతుకు అతని కళ్ళ ముందుకొచ్చింది

తనకు తెలివి వచ్చినప్పటి నుండి..

తండ్రి ఎగసాయపు పనులు చేస్తూ ఆసాముల తొండాలు, చెప్పులు కుట్టేటోడు. తన తల్లి కలవడం, కోయడం, కల్లాలు ఊడ్చడం, వొచ్చే కూలిగింజలతో పూట గడిపేది.

తాను ఎదగినంక తాను, తన పెండ్లం ఆ పనులే. అవే

కూలిగింజలు చావులకు, పెళ్ళిళ్ళకు, పండుగలకు పబ్బాలకు డప్పు వాయించేది ఇంత బత్తెమో, సత్తెమో యిచ్చెటోల్లు దేవుని సేవలు, సర్కారోళ్ళ సాటింపులు ఉత్తగనె !

ఎట్టిసాకిరిసెయ్యొద్దని సీకటోల్లు ఊరూరా సబలు చేసి సెప్పబట్టిరి అంతల్నే మందల తోడేండ్లు పడ్డట్టు రజాకార్లు ఊర్లమీద పడి కూరకోత కోసిరి, కాల్చి సంపిరి దొరలు, జాగీరుదారులు ఆల్ల కాల్లకాడ కుక్కలైరి

ఎట్లనోఅట్ల తెల్లోల్లు ఎల్లిపోయిరి నైజామోడు నాశనమాయె వోట్ల రాజ్యం వచ్చి అందరు కలసి బతకాలనిరి

దున్నేవాడికే భూమి అనిరి. బంచరాయి, పోరంబోకు బూములను. మాల, మాదిగల పేర్లు మార్చి హరి జనులని .తలా యింత పట్టాలిచ్చిరి. ఆటిల్ల తవ్వితే బాయి పడదాయే, దున్నితే సాలు రాదాయే. అయినా ఎకరం, అరెకరం ఎగసాయానికి ఎడ్లు, నాగళ్ళు ఎక్కన్నించొస్తయి? అవన్నీ మల్లా బంజర్లు అయి ఊర పసుల పాలాయే!

కాయకస్టం సేసిసేసి రెక్కలుడిగిపోయి, అమ్మ.. అయ్య రోగాల నొప్పులతో కాలం సేసి మంటకల్సిరి

తల్లీ. తండ్రీ గుర్తు రాగానే మల్లయ్య కళ్ళల్లో నీటి పొర కమ్ముకుంది "ఎదురుగా వొచ్చిపోయే వాహనాలు మసక మసకగా కనిపించాయి ఒకసారి అటు, ఇటు కదిలి కూర్చుని కళ్ళనీళ్ళొత్తుకున్నాడు

దరిద్రులను ఉద్ధరిస్తం అని సర్కారోళ్ళు అప్పులిచ్చి

తోళ్ళయాపారం చేయమనిరి అప్పు...యుగ బతుకులు మారిపోతయని ఆశపడి, సేసే పనులొదిలిపెట్టి తోళ్లు తెచ్చి పోతం జేస్తే ఆ రోజుల్లో ఆటిని కొనే దిక్కే లేదాయే.

కబ్బురు సెప్పులొచ్చి తోలు సెప్పులు తొలిగె. ఇంజన్లు, మోటార్లొచ్చి తొండాల పని తీరిపోయె....తోళ్ళెపారం సాగకపాయే. మా సోళ్లల్లో మన్నుపడే మద్దెన కర్నపోడు తీసుకున్న అప్పు తిరిగి యియ్యక తప్పదని ఆ అరెకరాన్ని అమ్మిచ్చె. ఆ తరువాత తెలిసింది కాలంగాక కరువచ్చిందని, యిచ్చిన అప్పులు మాఫైనవని. సర్కారోడు సాయంజేసినా, మద్యోడు మాయజేసె

ఆ తరువాత ఎలచ్చన్లొచ్చె.వద్దన్న పార్టీకి వోటుసింద్రని పగలు పెరిగి, ఎప్పుడో పటేలు కొడుకు మా కులపు పిల్లను గుంజితె కోట్టేసి కొట్టినందుకు మనసుల పెట్టుకున్న పటేలు ఊరందర్ని ఊసికొల్పి మా పాకలకు నిప్పుపెట్టిచ్చె. పోలీసోళ్ళు వాళ్ల పాటే పాడిరి. ఇంతల మావోడె ముఖ్యమంత్రె ఊరికొచ్చి, కాలిన మా పాకలు సూసి, ఊరమ్మటే తలా ఓ ఇల్లు కట్టిస్తే, గాలికి కప్పు లేసిపాయె, ఆనలకు గోడలు కూలిపాయె. మల్లా చెట్టుకింద బతుకులేనాయె.

* * *

"జెర ఈ చెప్పుల సంగతి చూడు" అంటూ చెప్పులను మల్లయ్య ముందు వదిలాడు ఓ వ్యక్తి.

వదిలిన చెప్పులను చేతుల్లోకి తీసుకున్నాడు మల్లయ్య.

"నిన్నెక్కడో చూసినట్టుంది" సిగరెట్ ముట్టించుకుని కాలుతున్న పుల్లను పారేస్తూ అన్నాడు

"నన్నా? చెప్పు మీద మొలను ఉంచి ఆ వచ్చిన పెద్దమనిషి వైపు చూశాడు

"నీది రాంపల్లి అనుకుంటా" అడిగాడు పీల్చిన పొగను ముక్కుల ద్వారా వొదులుతూ.

"అవునయ్యా"

"నన్ను గుర్తుపట్టలే, నీకు ఓ జర్సి ఆవును ఇప్పిస్తిని గదయ్యా! అప్పుడక్కడ నేను వి.డి.వోగ ఉంటిని"

"ఆః ఆః" అంటూ నోరు తెరచిచూస్తూ గతాన్ని గుర్తుకు తెచ్చుకోసాగాడు.

"అప్పుడు నీ ఫోటో పేపర్లో వేసిరి. నీ పేరు రేడియోలో చెప్పిరి. నీ పేరు మల్లయ్య గదు?"

"ఆః" అంటున్నప్పుడు ఆవును ఇచ్చిన రోజు కళ్ళల్లో కదిలింది.

"ఇక్కడొచ్చి ఎన్నాళ్ళైంది?"

"ఐదేండ్లు అయిపాయె" అంటూ చెప్పుమీది మొలను గూటంతో గుద్దాడు

"మరి ఆ ఆవును ఏం చేసినవ్?"

"యింకెక్కడి ఆవు"

"అదె ఎక్కడపాయె'

"ఆవు సచ్చె, దూడ సచ్చె". అప్పుడు ఆయన గుండెలో

నుండి బాధతో కూడిన గోణుపు ఓటి వచ్చింది

"అరే సచ్చిందా ! ఎట్లా" కాలిన సిగరెట్టు నుసిని పక్కకు దులుపుతూ అడిగాడు

"ఎందుకు సచ్చిందని పసుల డాక్టర్ని అడిగితే మూతి యిరిసెండు గానీ ఏం సెప్పలేదు" అంటూ చెప్పుకు బ్రష్ కొట్టి ఆయన ముందుంచాడు

"అబ్బానా అది బతికితె నీవు బాగుపడెటోనివే" అంటూ ఓ రూపాయి ఇవ్వబోయాడు

"వొద్దు సారు, గింత పనిక గూడ పైసలా? తమరెంత సాయం సెయ్యలేదు గప్పుడు" అంటూ చేతులు జోడించాడు

లేని నవ్వును తెచ్చిపెట్టుకుంటూ ముఖంలో మారిన రంగును కనపడకుండ దస్తిని మూతికి అడ్డుపెట్టుకుంటూ అక్కడి నుండి కదులుతూ ఇవ్వడానికి తీసిన రూపాయని తిరిగి జేబులో వేసుకున్నాడు.

ఒక్కసారి గతం కళ్ళముందు కదలాడింది

ఈయనకు సహాయం చేశానా!

అసలు ఆ ఆవు దర ఎంత?

"నాలుగు వేలు"

రసీదు ఎంతకు తెచ్చినం

"ఆరు వేలకు"

మిగతా రెండువేలు?

"మా కమీషన్" సిగరెట్ పూర్తిగ కాలడం వల్ల వేళ్ళకు సెగ

తగలగానే దాన్ని పక్కకు విసిరాడు

అయితే ఈయనకేమి చేసినట్టు?

“సహాయం అయితె కాదు”

మరీ

“మోసం”

ఆ మోసం నేను చేయలేదు, సర్పంచ్ చేయించాడు. అందరం కలసి పంచుకున్నాం

మల్లయ్య ‘సహాయం చేశారు’ అని చేతులు జోడించినపుడు చెంపమీద కొట్టినట్టు అనిపించింది

అందుకే జేబులోని దస్తి ముఖం మీదికొచ్చింది

అంతేకాదు ఆ రోజు ఆవును ఇంట్లో కట్టేసుకుని చేతికి అందించిన రెండుకోడిపుంజులు గుర్తొచ్చినవి పేదోనికి మేలు చేస్తే అది పెరటి తోట అయిపోతుంది అయినా వాళ్లని తిప్పుకుంటాం అప్పుడు చేసే పనిని ఆరు నెలలు సాగతీస్తాం!’

“అన్యాయం, అన్యాయం”అంటూ నడుస్తున్నాడు. ఆ మాటలు బైటికి వినపడగ రిక్షావాడొచ్చి పక్కన్నె ఆపుతూ “రిక్షా కావాల్న సార్” అనగానె, “ఆః” అంటూ అందులో కూర్చుని “జిల్లా పరిషత్‌కు పోని”అన్నాడు

* * *

మల్లయ్య బుర్రలో ఆవును గూర్చిన ఆలోచనలు కదిలాయి అది ఈ దేశపు ఆవు కాదు. పెద్ద రకపు ఆవు పూటకి పదిసేర్ల పాలిచ్చే ఆవు. ఆ రోజు మంత్రిగారు ఆ ఆవు

తగులు నా చేతికిస్తున్న ఫోటోను తెల్లారి పత్రికల్లో ఏసిండ్రు. తన పేరును రేడియోలో చెప్పిండ్రు ఆవు వచ్చినందుకు సంతోషం, పేరు అందర్కి ఎర్కైనందుకు సంతోషం గానీ, దానికేమి రోగమో ఇంటికొచ్చినంక రోజు ఇన్ని పాలు తక్కువియ్యటం మొదలుపెట్టె! నెల దాటేవరకు పూటకు పదిసేర్లు పోయి రెండోనెలలో ఐదుసేర్లకొచ్చె. మూడవ నెలలో దూడకు పుర్రుబెట్టె, ఆవు సగమాయే ఇట్లెందుకైందని పసుల డాక్టర్ని అడిగితే .

"ఈ ఆవుకు ఎండ తగులొద్దు, మేత బాగుండాలె" అనె.

మరి చెల్కలల్లకు కొట్టుకపోయి మేపుక రాకపోతే ఎక్కడ మేపను అది ఉండటానికి సల్లగ ఉండాలంటే ఉన్న రెండు మేకపిల్లలు అమ్మి ఓ కొట్టం గూడ ఏయిస్తి, తనకు బాయా? చెరువు కింద పొలమా పచ్చగడ్డి ఎక్కడినుంచి వొస్తది ఇంటిది కూలి మాని గడ్డి చెక్కుకొచ్చి పెడితే దాన్ని సరిగ తినదాయె!

రోజూ పిండి పెట్టాలనిరి.

పాల మోటరోడు నెలకు అరబస్తా పిండిస్తే సరిపోద్దాని కోడిపిల్లలమ్మి ఇంత తవుడు తెచ్చి గూడ పెడితి.

ఆ ఆవులను సాదాలంటె మాటలు కాదు. పేదోడు సాదలేడు

మరి పేదరికం పోగొడతందుకే దాన్ని ఇస్తున్నాం అని ఆయాల్ల మీటింగులో సెప్పిరి. కాని దాన్ని సాదటంలో ఉన్న బాధలు ఎవరికి తెలుసు? ఒకరికి ఇద్దరం కూలి మాని గడ్డి గాదం తెచ్చి కాపల కాసి కాపాడిన ఆవు దక్కదాయె మొదట

దూడ సచ్చె. అది సావంగానే దూడలేందె ఆవు పాలు ఇయ్యదంటె, సచ్చిన దూడను అమాంతం తిత్తి తీసి దాంట్లో ఇంత పొట్టు నింపి, ఎదురుగ నిలబెడితె పాలు ఎన్ని రోజులిస్తది? రెండు, మూడు రోజులిచ్చె పూకునె ఆ తర్వాత అదీ సచ్చె, అది బతికి నన్ను బతికిస్తదేమో అనుకుంటే అదట్లాయె అది ఎట్లా సచ్చిందని అడిగితే ఏం సెప్పను ఏమేమో రాసుకున్నరు ఆవు దూడ బాపతు రకం కట్టమన్నరు అప్పు అప్పె అన్నరు ఎన్నాళ్ళు రెక్కలిరుసుకుంటే ఆరు ఎయిలు తీర్తయి ఆవు వొచ్చినాడు ఏడ్చిన కులపోల్లు ఉన్నది బాయె, కొన్నది బాయని నవ్వసాగిరి. కూలికి బోకుండ గడవదాయె. అందుకనే తెల్లారె పల్లెనిడిసి పట్నమొస్తి.

చేతిలో చెప్పులు.

చుట్టూర పనిముట్లు.

అదే కులవృత్తి

అప్పుడేమో పాకముందట, ఇప్పుడేమో రోడ్డు పక్కన ఇక్కడ సంపాదన తక్కువ కర్సు ఎక్కువ, పోంగ సేతినిండ పనేది? మామూలోల్లు రబ్బర్ చెప్పులా, ఉన్నోల్లు కంపిని చెప్పులా! ఇంకా కొందరు బూట్లా? వాటిని తొడిగినన్ని రోజులు తొడిగి పారెయ్యడమేనా, ఆటికి రిపేరెక్కడిది? రిపేరు లేకుంటె మాకు ఇక్కడ పనెక్కడిది? పని లేకుంటె రూపాయెక్కడిది రూపాయి లేకుంటె పొట్టెట్ల గడుస్తది? ఇగ పొలీసు పనంటర, బడి ఎగ్గొట్టిన పోరగాల్లు సంకల సంచి,

సేతిల బుర్నాయే హోటల్ కాడ, రైల్లల్ల, సినిమాలకాడ అంతట ఆల్లేనాయె అదీగాక ఇప్పుడొస్తున్న కొన్ని బూట్లకు పాలీసు గూడ అక్కరేలేదు, తుడుసుకుంటె సాలు, ఎంతున్న ఈ పన్ల పూట గడవదు అప్పు తీరదు అంతటా ఇంతేనేమో తెల్వదు గాని మన దేశంలో మాత్రం, సందాలంటే వందలిస్తరు, లంచాలంటె ఎయిలిస్తరు, కష్టం సేస్తోన్ని కనిపెట్టరు కష్టం సేస్తోనికి అన్నీ కష్టాలే మొన్ననే ఆస్టల్లో చేరిపించిన కొడుకన్నా ఈ పనినుండి తప్పించుకుంటాడో?

"ఇదిగో ఈ చెప్పులను కుట్టిస్తావా" అంటూ తన ఎదురుగ నిలుచున్న ఓ పెద్ద మనిషి మాటలు మళ్ళీ పనిలోకి దించినయి. తలవంచుకుని చెప్పులను రిపేరు చేస్తున్నాడు ఈలోపు రోడ్డు మీద పోతున్న జీపుకు కట్టిన మైకులో "సోదరుల్లారా రేపు మా పార్టీ వాళ్ళు బందును ప్రకటించారు కావున మీరంతా సహకరించి బందును విజయవంతం చేయ్యాల్సిందిగా మనవి" అంటూ మల్లి మల్లి ప్రకటిస్తూ జీపు మూడో చౌరస్తవైపు వెళ్ళింది

"రేపు మల్ల బందా? ఇగ ఉపాసమే వారానికో బందైతే ఎట్ల బతికేది" అంటూ తనలో తాను గునుక్కున్నాడు. అది విన్న పెద్దమనిషి..

"బందునాడు వచ్చిపోయే జనం ఉండరు. మీకు పని కూడ ఉండదు కదా!" రోడ్డున పోయే జీపు వైపు, ఆ తరువాత మల్లయ్య వైపు చూపులుంచుతూ అన్నాడు.

"ఏ పూట వచ్చినయి ఆ పూటేనాయె ఏం రాకుంటె ఏం లేదు మా బతుకుల్లో పస్తులే ఎక్కువ సారు?" కుట్టిన చెప్పును ఆయన ముందేస్తూ, రెండ వ చెప్పు కోసం చెయ్యి చాపుతూ "ఉన్న మారాజుకు ఏ బాధలూ లేవు మాబోటోల్లకే తిప్పలు. కూలి లేకుంటె కూడు గడవదు. ఈ నెలలో నాలుగైదు బందులు బడిపిల్లల బందు, నౌకర్‌దార్ల బందు, పార్టోల్ల బందు, దుకాన్‌దార్ల బందు, సస్తే బందు, కొట్టుకుంటే బందు, తిట్టుకుంటే బంద్ ఈ బందులతో బతకలేక పోతున్నంసారు" అంటూ రెండవ చెప్పును చేతిలోకి తీసుకొని చూస్తున్నాడు మల్లయ్య.

ఓ మాదిరి నవ్వుముఖంతో పెద్దమనిషి

"మనది ప్రజాస్వామ్యము బాబు, భరించక తప్పదు" అన్నాడు

"అంటే"

"మన కోసం, మన ప్రభుత్వాన్ని మనమే ఎన్నుకోవటం"

"గ వోట్లేసేదా"

"అః అదే అదే"

"వోట్లేసినోల్లకే కూలి బందైతదని పార్టోల్లకు తెలవ కుండొచ్చునా"

"తెలిస్తే బందెందుకు చేయిస్తరు. అసలు ఆ విషయాన్ని వాళ్ళెప్పుడైనా ఆలోచిస్తె గదా"

అదెందో రాను రాను బరిసెలోడు. ఆడు పోయి,

తుపాకులోడొచ్చె, ఈ యిద్దరు పోంగ బాంబులోడు. ఎవరొచ్చిన ఆల్లాల్లు బాగానే ఉంటరు మద్దెన జనాన్ని సంపుతుంట్రు. ఇట్లైతే ఈ లోకం ఉంటదా సారూ."

పెద్దమనిషి చిన్నగ నవ్వి, చెప్పులను తొడుక్కుంటూ "పత్రికవాడో, టీవీ వాడో నిన్ను పలకరిస్తే బాగుండు" అని జేబులో నుండి డబ్బు తీసి ఇచ్చాడు.

"అయ్యా ఇన్ని కనిపెడుతుంట్రు ఆకలి కాకుండా మందెందుకుకనిపెట్టరు?"

"దాన్ని కొనడానికి మళ్ళీ డబ్బులేకావాలి కదా"

అవును అన్నట్టు మౌనంగ తల ఆడిస్తూ -

"అయ్యా ఏమనుకోవద్దు, కడుపుల కాలి ఏదేదో ఒర్లిన" అంటూ చేతులు జోడించాడు.

"మాట్లాడే హక్కు అందరికీ ఉంది. అందులో ఉన్న మాటే అన్నావు" అంటూ అదే నవ్వు ముఖంతో అక్కడినుండి కదులుతున్నపుడు ఒ మంచి కొత్త పుస్తకం చదివినట్టు ఫీలయ్యాడు

"నాయి మాటలు కాదు తండ్రీ బాధలు" అంటూ పెద్దమనిషి వెళుతున్న వైపే కనపడకుండా వెళ్ళేవరకు చూస్తుండిపోయాడు. ఆ తరువాత అంత దూరం నుండి కోతిని పట్టుకుని వస్తున్న ఓ ముదుసలి వైపు మల్లయ్య చూపులను మళ్ళించాడు.

కోతి మెడలోని గొలుసు మనిషి చేతిలో ఉంది. మనిషి చేతిక్కర కోతి భుజమ్మీద ఉంది.

మనిషికి కోతి ఆసరా? కోతికి మనిషి ఆసరా?

ఈ లోపల కోతి మల్లయ్య ఎదుటకొచ్చి గంతులేసింది ఆ తరువాత చేయి చాపింది. దాని చేతలు చూస్తూ అన్నీ మరిచిపోయిన మల్లయ్య తాను కూర్చున్న గోనె సంచి మడతల్లో నుండి ఓ పావల తీసి కోతి చేతిలో పెట్టాడు

కోతి సలాం కొట్టి ముందుకు నడిచింది. వెనకాల మనిషి! అప్పుడు ఎందుకో మల్లయ్య ముఖాన ఓ మాదిరి నవ్వు పూసింది. అది ఎలాంటి నవ్వో ఆయన లాంటి మనుషులు తప్ప మరెవరు చెప్పగలరు?

మార్చి 1995
ఇండియాటుడే

# గ్రహణం

పోలీసు వాహనం రాజమండ్రి జైలు ముందు నుండి కదిలింది అంతకు ముందె హైదరాబాద్ వరకున్న అన్ని పోలీస్ స్టేషన్లకు వైర్‌లెస్ మెసెజ్ వెళ్ళింది.

తన రచనల ద్వారా ప్రజలకు ప్రశ్నించమని నేర్పుతూ ప్రభుత్వాన్ని పడగొట్టే కుట్ర పన్నుతున్నాడన్న నేరం మోపి, విచారణ నిమిత్తం హైకోర్టుకు తీసుకు వెళుతున్న ప్రజాకవి ‘రాజం’ను మార్గమధ్యంలో పోలీసుల నుండి తప్పించుకు తీసుకెళతామని అజ్ఞాత వ్యక్తుల ఫోను.

వ్యాన్ విజయవాడ దాటి, కోదాడ దాటి సూర్యాపేట చేరుకుంది. జాతీయ రహదారి లోని అంబేద్కర్ విగ్రహం దగ్గర గుంపులు గుంపులుగ జనం.

పోలీసులు తుపాకులు సర్దుకున్నారు పోలీసు ఆఫీసర్ కాస్త అసౌకర్యంగా కదిలి, మెసేజ్ గుర్తుకు రాగా .

"సార్ వీళ్ళంతా మీ ఫాలోయర్స్ కారు కదా?" రివాల్వర్‌ను ఓసారి తడుముకుంటూ అన్నాడు

అప్పటి వరకు చదువుతున్న పుస్తకం పేజీల్లో నుండి చూపులను పోలీస్ ఆఫీసర్ వైపు మరల్చి, ఓ చిరునవ్వు నవ్వి జనం వైపు చూశాడు

"డ్రైవర్ వ్యాన్ వెనక్కు మలుపుకొని పాత రోడ్డు గుండా పోనీ" అన్నాడు పోలీసాఫీసర్

వ్యాన్ పట్టణ మధ్య నుండి పొట్టి శ్రీరాములు బొమ్మ దగ్గరకొచ్చేసరికి మళ్ళీ జనం ఈసారి గుంపులుగ కాదు ఒక వరుసలో నినాదాలిస్తూ నడుస్తున్నారు ఆడవాళ్ళు చేతుల్లో కాలి నీళ్ళ కుండలు

పోలీసు ఆఫీసర్ వైర్‌లెస్ ఆన్ చేసి .

"హల్లో, హల్లో పోలీస్‌స్టేషన్"

"హల్లో, హల్లో యస్" స్టేషన్ ఇన్‌ఛార్జి.

"హాల్లో ఈ జనం ఓవర్ -"

"హల్లో, హల్లో వాళ్ళు నీళ్ళ కోసం ధర్నా చేయడానికి మండలాఫీసుకు వెళుతున్నారు. మీరు ఫార్వార్డ్ కావచ్చు."

ఆ నాలుగు మాటలని వైర్‌లెస్ ఆఫ్ అయింది.

వ్యాన్ వేగం పెరిగింది నార్కట్‌పల్లి, చిట్యాల్ దాటి గుడ్రాంపల్లి చేరింది.

రాజంరోడ్డుకు ఇరుప్రక్కల చూస్తు ఊరు ఏమంతగ మారలేదు అవె పెంకుటిండ్లు, ఒకటి రెండు కొత్తడాంబరు అదనంగా కట్టెకోతమిషన్. పోలీసు ఆఫీసర్ వైపు మళ్ళి-

"సార్ ముందు పంతంగి ఊరొస్తుంది. అక్కడ ఓ నిముషం ఆపండి అది మావూరు" అన్నాడు రాజం

పోలీసాఫీసర్‌కు ఆపాలని లేకున్నా ప్రముఖ కవి అని గుర్తు రాగానే "మీకు ఓ ఊరేంటి సార్, మీరేవూళ్ళో వుంటే అదే మీ ఊరు" అన్నాడు

ఈసారి మెల్లగ శబ్దం లేని నవ్వు నవ్వాడు రాజం

"వీలుంటే ఒక్క నిమిషం" అంటు పుస్తకాన్ని మూసి పక్కకు పెట్టాడు.

"తప్పకుండా సార్" అంటూ డ్రైవర్‌కు సైగ చేశాడు వ్యాన్ ఆగింది. అందరూ దిగారు.

ఒకప్పుడు రోడ్డుకు కిలోమీటర్ దూరంవున్న ఊరు యిపుడు రోడ్డు దగ్గరకి చేరింది. ఒత్తుగా వున్న తాడి చెట్లు పోయి, చిక్కగా కంప చెట్లు పెరిగాయి బంగారుపూలతో అందంగా కనిపించే తంగేడు పొదలు మచ్చుకు లేవు! చుట్టు కలియ జూస్తూ బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకోసాగాడు వ్యాన్ ఆగగానే అక్కడున్న జనం చుట్టూర గుమిగూడారు. ఎవరూ రాజంను గుర్తుపట్టలేదు అందరు చూస్తూ నిలుచున్నారు. ఆయనకిపుడు యాబది ఏండ్లు, సగం నెరసిన గడ్డం, సన్నవి ఫ్రేం కళ్ళద్దాలు.

ఆ వూరి పిల్లలకు ఆయన అసలు తెలియదు.

యువతీ యువకులూ ఆయన్ను ఎన్నడు చూడలేదు
ఆయనా ఎవరిని గుర్తుపట్టలేకపోతున్నాడు.
తనబాల్యాన్ని బెదరగొట్టిందీ ఊరు!
తన కుటుంబాన్ని చెదరగొట్టిందీ ఊరు!!
"కవిగారు ఇకవెడదాం" పోలసుఆఫీసర్

రాజం కదిలాడు, అతని వెంట తుపాకులు నడిచాయి. ఆ తరువాత వాహనం కదిలింది రాజం తలనిండా గతం తాలూకు ఆలోచనలు కదిలాయి . .

*　　　*　　　*

గుడి గుర్తొచ్చింది
ఆ తరువాత ఆనాటి ఊరు గుర్తొచ్చింది

ఆ రోజు దేవుని పెళ్ళి జరిగి సాయంత్రం ఊరేగింపు తరువాత ఉత్సవ విగ్రహాన్ని గుడికి చేర్చి తమ తమ ఇళ్ళకు వెళుతున్న అందరితోపాటు అంత వరకు డప్పులు కొట్టి పై నుండి వేసిన పైసలను అందుకుని యిళ్ళకు వెళుతున్న డప్పుల వాళ్ళల్లో మా అయ్య ఒకరు. అంత వరకు అయ్య వెంట నడిచి నేనొస్తా పద అని, అక్కడే నిలుచొని చుట్టు చూస్తున్న నా తలలో రకరకాల ఆలోచనలు.

ఆ గుళ్ళో దేవుడు ఎలా వుంటాడో మా పెద్దలు ఎవ్వరు చెప్పలేదు వాళ్ళూ ఎన్నడూ చూడలేదట. అంతే కాదు వాళ్ళు దేవుడు అని మాత్రమే అనాలి. రాముడు అని గూడ అనొచ్చు ఊరి బ్రాహ్మణులందరిని పేర్లు పెట్టి పిలవద్దు అయ్యగారు.

పంతులు అనాలి, చిన్న పిల్లలను కూడ చిన పంతులు అని పిలవాలి ఒక రోజు నాతో పాటు చదువుకుంటున్న కరణం కొడుకును పేరు పెట్టి పిలిస్తే వాళ్ళ నాయనమ్మ విని -

"ఎందిరా మా అబ్బాయిని పేరుపెట్టి పిలుస్తావా? చినపంతులూ అనలేవూ?" అంటు గుడ్లురిమింది, ఇంకా గుర్తుంది

"వస్తే నాలుగక్షరాలు రావచ్చు కానీ పుట్టిన కులం ఎక్కడకి పోద్దిర" అని అన్నది యింకా మరిచిపోలేదు గుంజలకు కట్టివుంచిన ఆరిపోయిన దివిటీలను విప్పదీసి ఒక చోట వేస్తున్నారు మంగలి యాదయ్య, చాకలి పెంటయ్య, మసక చీకటి. మెల్లగ నడిచి పందిరి దగ్గరకొచ్చి గుంజచాటుకు నిలుచున్నాను అప్పుడు దేవుడు కాస్త దగ్గరయ్యాడు అయినా కనిపంచడం లేదు. దర్వాజా దగ్గరికెళ్ళాలి అప్పుడు కనిపించొచ్చు. మా తాత చూడలేదు. మా తండ్రి చూడలేదు అసలు వాళ్ళెవరూ ఆ బాట దాటి రానే లేదట ఇక పందిట్లోకి వచ్చేదెక్కడిది దేవున్ని చూడాలి! చూడాలి కానీ నన్ను ఎవరైనా చూస్తే తలనిండా ఆలోచనలు, వంటినిండా బయం

వున్నట్టుండి తలమీద ఏదో బలమైన హస్తం! అంతే. కాళ్ళల్లో వణుకు వచ్చి కళ్ళు బైర్లు కమ్మాయి మెల్లగ చేత్తో అదిమి చూశాను. అది పూజారి చేయి కాదు పందిరకి కట్టిన తోరణం నుండి జారిపడ్డ మామిడి కొమ్మ వణుకు తగ్గి గుండెలో కాస్త దైర్యం చేరింది.

దేవున్ని చూడాలన్న ఆ బలమైన కోరిక బెదురును తగ్గించింది అడుగులో అడుగేస్తూ మెల్లగా వెళ్ళి దర్వాజ దగ్గర నిలుచున్నాను. ఎవరో వస్తున్నపాదాల అలికిడి. అంతే అలాగే బాజును పట్టుకుని గోడకు బల్లిలా ఆనుకొని నిలుచున్నాను వస్తున్న వాళ్ళ పాదాల చప్పుడు మరీ దగ్గరౌతూవుంది. గుండె వేగం పెరగసాగింది వళ్ళంతా నీళ్ళు నింపిన కొత్త కుండైంది

దేవునికొచ్చిన కొత్త బట్టల మూటేమో పెంటయ్య భుజాన, కొబ్బరి పచ్చెలు, పండ్లు, ఫలాలున్న గంప వున్నట్టుంది యాదయ్య తల మీద సరిగా కనబడనీయని చీకటి కదా. ఒకరి వెనకొకరు బయటికి నడిచారు నన్ను చూడనందుకు ముందు వాళ్ళకు ఓ దండం పెట్టి, ఇక లోపలికెల్లొచ్చు అనుకుంటూ దర్వాజావైపు మళ్ళాను ఎదురుగా తుపాకీలాగ ఓ అంచుకర్ర, దానితోపాటు "ఎవర్రా" అన్న భయంకరమైన గొంతు ముందు వేయటానికి ఎత్తిన పాదం తెలియకుండానే వెనక్కు వెళ్ళింది దేవున్ని చూడాలనుకున్న నా ఎదురుగ దయ్యంలాంటి ఆకారం, గొంతులో తడారింది. అక్కడి నుండి పరుగే పరుగు

* * *

మరునాడు ఉదయం కరణంగారి వాకిట్లో అయ్య తల వంచుకుని నిలుచున్నాడు. అమ్మ ఏడుస్తూ కొంత దూరంగ

వేప చెట్టు చాటున నిలుచుంది. అయ్య పక్కన నేను, చుట్టూర మరో పది మంది యితర కులాల పెద్దలు

కరణం చూపుల్లో నిప్పులు రాలుతున్నాయి. ఒక చేతిలో పంచె కొంగు, మరో చేతిలో అంచుకర్ర, కిర్రు చెప్పులతో అటు ఇటూ తిరుగుతున్నాడు. అవి మా అయ్య కుట్టినవే వాటి అల్లికలు అమ్మ అల్లినవే తాము చేసినవయినా అవి అప్పుడు మాత్రం తమ మీద పడేటట్టు కనిపించాయి! ఎందుకంటే రెండు మూడు సార్లు చెప్పును చేతుల్లోకి తీసుకోచూసిన కదలికలు. కరణం మరోసారి గుడ్లురిమి చూస్తూ - "ఎన్నడైనా ఇట్లా జరిగిందా" అయ్యవైపు చూశాడు.

"మీరెవరైనా యిట్ల జరిగిందని విన్నారా?" అంటూ అక్కడ నిలుచున్న పెద్దల వైపు చూశాడు.

"అపవిత్రం; అమంగళం! గ్రామానికి గండం!" నుదుట, ఎద బాగాన విభూతి మెడలో రుద్రాక్ష మాల, నడుముకు ఉత్తరీయంతో ఆ గుడి పూజారి

ఆయన మాటలు అక్కడ పల్లేరుకాయల్లా పరుచుకుంటున్నాయి.

"ఏదైనా శాంతి ఆలోచించండి" సాతాని పంతులు సలహా.

"ఏం శాంతి సేస్తారు? ఎంత ఖర్చు అవుతుంది? ఎవరు బరిస్తారు?" కరణం

"నిన్న దేవుని లగ్నం చేయడానికే ఎందరికో పంచె పట్టవల్సి వచ్చింది" ఆ పూజారి మాటలో కొంత అలసట కల్సివుంది,

మరి ఆయన బరువైన శరీరం వల్ల వచ్చిందో అంతకు ముందు జరిగిన వేడుకల పనిబారం వల్ల వచ్చిందో లేక మా మీదున్న విద్వేషం వల్ల వచ్చిందో!

"అయితే ఊర్కుందామంటార" కరణం.

"పూర్కుంటే ఊరికి అరిష్టమండి" పూజారి.

"చెప్పండి ఏం చేద్దాం?"

"ముందు అంటుపడ్డ గుడికి వెల్ల వేయాలి, మిగతా విషయాలు తరువాత" పూజారి

"అయితే కానీయండి. ఆ ఖర్చును ఆని తండ్రి ఈరిగాని దగ్గర వసూలు చేయండి "

అప్పుడు అయ్య చేతులెత్తి నమస్కరిస్తూ అందరి వైపు చూశాడు అక్కడున్న ఎవ్వరూ అయ్యవైపు చూడలేదు. అందరూ అంతే అన్నట్టు తలలు దించి నిలుచున్నారు.

అది గ్రహించిన అయ్య తలపాగను తీసి కిందుంచి మోకాళ్ళమీదవంగి చుట్టూ చూస్తూ, "గులాపొన్ని తమరే కాపాడాలి వంటిమీద అంగి లేనొన్ని ఎక్కనించి తెచ్చేది " అన్నాడు

అయ్య తలపాగాను అక్కడుంచలేదు, తన తలనో, నా తలనో తీసినేలమీద పెట్టినట్టనిపించింది

"పూటకు లేనోళ్ళం మేమెక్కడ తెచ్చిస్తం దొరలారా, మా దయగల తండ్రులు కనికరించుండ్రి. ఆడు తెల్వక ముట్టుకుండు" అన్న మాటలు వినపడగానే వెనక్కు చూశాను

చెట్టు చాటు నుండి జోడించిన చేతులు మాత్రమే కనిపించినాయి అవి వూరికి చాకిరి చేసి నలుపెక్కిన చేతులు వాటికి అరిగి రంగు వెలసిన మట్టి గాజులు

"అప్పు సెయ్యి" అప్పటివరకు చేతిలో కదిలే కర్రను కదలకుండ పట్టుకుంటు అన్నాడు కరణం

"అప్పెవరిస్తారు తండ్రీ" అంటు అయ్య లేచి నిలుచున్నాడు.

"నీకో బర్రె వున్నట్టుంది" పూజారి ఏదో గుప్తనిధిని గుర్తు చేసినట్టు అన్నాడు

"దాన్ని అమ్మొచ్చు" వాకిట్లో వున్న గడ్డిపోచను కర్రతో పొడుస్తూ చూపులను దాని మీదే వుంచి అన్నాడు.

"ఆకలైనా, దూపైనా, దాని, పాలె. సారెడు సల్లతాగి పొద్దుగడుపుతం పిల్లగానికి యిన్ని పాల సుక్కలు దాన్నమ్మితే బతకలేం" అంది అమ్మ చెట్టుచాటునుండే

కరణానికి ఏదో తట్టినట్టు రెండడుగులు ముందుకేసి అందర్నీ దగ్గర్కి రమ్మని సైగచేసి గుసగుసలాడి

"ఈరిగ అల్కటి మార్గం సెవుతం ఈ పని అయితది"

ఒ కన్ను సగం మూసి తెరుస్తూ తలనాడించాడు

"దొర అయ్యేదైతే అంతకన్నా కావల్సిందే ముంది"

"నువ్వింటవు మరి నీ కొడుకింటడ"

"తప్పు చేసింది ఆడే కదా యినిపిస్త సెప్పండ్రి" అంటు దోసిలి పట్టాడు

"వాన్ని ఎవరి దగ్గరన్నా జీతం కుదిర్చి అప్పు తీసుకర!"

"అమ్మో నేను చదువుకొనాలె" అంటు వెళ్ళి అమ్మ ఒడిలో ముఖం దాచుకున్నాను

"ఈరిగ కర్ణపాయన అన్నట్టు కొడుకును జీతం వుంచర" పూజారి.

'నేను జీతం వుండ చదువుకుంట" ఈసారి పెద్దగ అరిచాను

"అదిష్టం లేకపోతే ఆ బర్రెనమ్మర ఊరకే ఆలోచిం చేదేంది?"

అక్కడున్న పెద్దలలో నుండి మరొకరి సలహా.

అయ్య ఏమనుకున్నడేమో, వంగి తలరుమాలు నందుకొని సంకలో పెట్టుకొని, యిప్పుడే వొస్త అని సెప్పి మమ్మలను యిక్కడ వుండమని సైగచేసి యింటి వైపు నడిచాడు. అమ్మా నేనూ వేపచెట్టు మొదటనే నిలుచున్నాం కొంచెం ఎండెక్కింది అక్కడ వున్న వాళ్ళ మధ్యన గుసగుసలు

కొంతసేపయ్యాక వాళ్లు కోరినట్టుగానే బర్రెను, దూడను కొట్టుకొచ్చి అక్కడున్న వేపచెట్టుకు కట్టేశాడు అమ్మ కళ్ళ నుండి కన్నీటి ధారలు, ఏదో అనబోయిన అమ్మవైపు గుడ్లురిమి చూసి, నోరెత్తద్దు అని కళ్ళతోనే సైగ చేసాడు అమ్మ తల వంచుకుని దు:ఖాన్ని మింగుతువుంది

అయ్య చేతులు జోడించి అందరి వైపు చూస్తూ

"ఈ బర్రె మీదేలే అన్నాడు" అంతేకాదు.

"పూటకు లేకున్నా మాట పడను" అనికూడ అన్నాడు

ఎవరు చప్పుడు చేయలేదు

అమ్మ ఎదలోని బాధను నెమరేసుకుంటోంది.

"దీని పాలు తాగి బతుకుతున్నం". తన్నుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకుని అమ్మను వొదిలించుకుని అందరి ముందుకు వెళ్ళి -

"యిక దేవున్ని కడుగుతరో, మనిషి ముట్టుకుంటె మైలపడ్డ గుడినే కడుగుతరో మీ యిష్టం" ముక్కుపుటలు కదులుతువుండగా చుట్టూ చూస్తూ అన్నాను.

"ఏంరో' చిన్న పెద్ద లేకుండ ఉపన్యాసం ఇస్తున్నవు" పూజారి

"ఉన్నది వున్నట్టంటే ఊరు అచ్చిరాదు అని అప్పుడప్పుడు అంటూ ఉంటారు కదా. "యిప్పుడూ అంటున్నాం" అందుకే మేమే ఈ ఊరొదిలి పోతం రావే" అంటు అయ్య చెయ్యి పట్టుకుని చెట్టు దగ్గర్కి వచ్చి, ఒసారి బర్రెను, దూడను చేతితో తాకి అమ్మ చేయిని పట్టుకుని అక్కడి నుండి కదిలాము. ఆ వూరును వదిలాము

ఊరంటే ఇల్లు - వాకిళ్ళే కాదు! ఊరంటే మనుషులుకాదా?

* * *

అపుడు అమ్మ నా నోరు మూయగలిగింది! ఇపుడు ప్రభుత్వం జైల్లో పెట్టగలిగింది! అయినా నా ఆలోచనలను

ఆపగలరా? నా పెన్నును మూయగలరా?
వ్యాన్ హైకోర్టు ఆవరణలో ఆగింది.
మెట్ల మీద నల్ల కోట్లవాళ్ళ కోలాహలం!
పైన కోర్టు భవనపు గోపురాల అంచులకు తల కిందులుగా
వేలాడుతున్న గబ్బిలాలు!?

ఆంధ్రజ్యోతి
మే, 1995

# చీమలు

ఊరుకు ఫర్లాంగు దూరములో ఓ చెరువు

ఆ చెరువు ఆ ఊరికి కన్నతల్లి లాంటిది. తల్లి తన బిడ్డకు రెండు రొమ్ములు కుడిపి పెంచినట్టు, చెరువు పూర్తిగ నిండితే రెండు కార్లు ఆ వూరి పొలాల్ని పారించి పండిస్తుంది. వర్షాల్లేక కుంటలు ఇంకిపోయి చెరువులు దగ్గరికయినయి. అందువల్ల ఉన్న నీటిని జాగ్రత్తగా పారించుకోవాల్సి వుంది కట్టెమ్మటి ఉన్నోళ్ళ పొలాలు, పోను పోను పేదోళ్ళ పొలాలు. భూస్వాములకు తప్ప ఎవరికి పదెకరాలు లేవు. ఈ కారు ఆఖరి వరకు పారటం కష్టం.

పెద్ద భూస్వామి సీతయ్య దగ్గరి కెళ్ళి, "దొర! పేదోల్ల మీద ఓ కన్నుంచాలె" అన్నారు పేద జనం.

పారినంత వరకు పారించడం తప్ప మరో మార్గం లేదన్నాడు సీతయ్య

రోజు తప్పించి రోజైనా సరె అందరి పొలాలకి నీరందాలని మిగతావాళ్ళ వాదన

అందరు అలుగు దగ్గరున్న మర్రి చెట్టు కింద మైసమ్మ గుడి ప్రక్కన నిలుచోని చెర్లో నీళ్ళను, చెర్వు కింది పొలాలను చూస్తున్నారు

"ఈ వున్న నీళ్ళను అందరి పొలాలకు పంట చేతికొచ్చే వరకు పారించడం కష్టం" అన్నాడు భూస్వామి సీతయ్య అందరికంటె అన్ని వున్నవాడు వయసులో అరవై దాటినవాడు అప్పులు యిస్తుంటాడు. అందుకని అందరు ఆయన్ను దొర అంటారు అంతేకాదు ఆయన పుట్టుకతో కూడ వెలమ దొర

"అట్లెట్లా దొరవారు" అన్నాడు షావుకారు రంగయ్య తన పొలం పారకుండా పోద్దేమోనని.

"ఎట్టేంది స్టాకు లేకున్న పందార ఇస్తవా నీవు" సీతయ్య రంగయ్య జీవంలేని నవ్వు నవ్వి వూరుకున్నాడు.

'వున్న ఎకరం పారకపోతే యిగ ఎండిల్లే' అన్నాడు వడ్డెరి పెంటయ్య

"నాకు ఇరవై గుంటలు. అది ఎండి పోతే మా పని పుత్తదే" సంకలోని సంచిని సర్దుకుంటు అన్నాడు మంగలి మల్లయ్య.

"ఇప్పుడు వొక్క ఆన బడితేనా" అంటూ పెదవులను అదిమి వొదిలాడు నీరుడుకాడు శివయ్య. (నీరుడుకాడు

చెరువు నీటిని పొలాలకు పారించే వ్యక్తి)

"సూడండి మొత్తం సెరువు కింద పారుగడి ఆరొందల ఎకరాలు కట్ట దగ్గర వున్న భూస్వాముల మూడొందల ఎకరాలు పారితే మా ఎక్కువ యిగ మిగిలిన వాళ్ళు ఆశవొదులుకోవాల్సిందే" అంటూ శివయ్య చిట్టా విప్పుతు అందరి వైపు చూశాడు అంతేకాదు నేను సెప్పేది నిజం అన్నట్టు కదిలాడు

"అంటె ఆల్లకె కడుపుంది ఆల్లె అన్నం తింటరు, మాకన్న మొద్దు" గౌండ్ల సిద్దగొని పాపయ్య

"అట్లని కాదు. ఉన్న నీళ్ళు మొత్తం పొలమ్మైతె పారదు" – ఈసారి శివయ్య గొంతు తగ్గి చూపులు తడబడ్డాయి

"అంటె" బంటోల్ల పిట్టెల రాములు

"దినం తప్పించి దినం పెట్టినా మీది పొలం పారి కింది పొలం సగం గూడ పారదు. నేను వున్నది వున్నట్టు చెపుతున్నా" అన్నట్టు చూశాడు శివయ్య

"అట్లెందుకు మీది పొలం వదిలి కింది పొలమే పారిస్తే" కురుమ బీరప్ప సలహా.

సీతయ్య బీరప్ప వైపు అదో మాదిరిగా చూశాడు.

"బీరప్ప అంత అలకగ మాట్లాడకు. కింది పొలం వాళ్ళు కిరాయికి దున్నిచ్చి మొలక చల్లినోల్లే. ఒగందుకు వాళ్ళు వోర్చుకోవాల్సిందే గాని, మీది పొలం వాళ్ళందరు గొడ్డు, గోద వున్నోళ్ళు. ఆ పొలం పారితే గింజలొదిలి పెట్టు, గడ్డన్న

దక్కాలి గద, లేకపోతే ఆ నోరులేని పసులు బతికేది ఎట్లా" అని మట్టారెడ్డి అనగానే -

"అవునవును మేము పసులకంటె ఈనమాయె" చింతకింది అయిలయ్య అందుకున్నాడు

"మనం మనం తగాద పడేదెందుకు అందరం కల్సి ఎమ్మార్వోకి దరఖాస్తు పెడదాం వాళ్ళు ఎట్లా సెప్పితే అట్లా" సీతయ్య

"సర్కారోళ్ళు పేదల నోళ్ళు గొట్టి పెద్దోల్లకు పెట్టేటోల్లాయె ఆల్లేమి సెపుతరు, మన ఊరు సంగతి మనమే తేల్చుకోవాలె" బీరప్ప.

"అదిగో సర్‌పంచ్ గూడ వొస్తున్నాడు. ఆయన ఏమంటాడో యిందాం" మట్టారెడ్డి సీతయ్య తరువాత ఆ వూర్లో మంచి ఆస్తిపరుడు రెడ్డియే అంతేకాదు ఆయన రాజకీయాల్లో గూడ తిరుగుతువుంటాడు

"సర్‌పంజి మాట మీరింటారా ఆయన మావోలెనె పూటకు లేనోడాయె" అయిలయ్య

మోకాలి వరకు ముతకదోతి, అంగట్లో కొన్న తెల్ల అంగి. సగం నెరసిన జుత్తు. బుజం మీద ఎరుపు తెలుపు గీతల కండవ. చదువు చాయల్లేని అమాయకపు చూపులు

"వున్నా లేకున్నా మీరంతా ఎన్నుకున్న సర్‌పంచ్ గదా!" మట్టారెడ్డి.

ఆ వూరి సర్‌పంచ్ స్థానం ఎస్.టి ది. అతను వుండే

విధానం, మాట తీరుని బట్టి 'ఎరుకలి సాయన్నె' అంటారు గాని 'సర్పంచ్'గారని ఎవరు పిలవరు కులవృత్తి తప్ప ఆయన మరోపని గూడ చేయలేడు ఈ మధ్యనే సంతకం చేయనేర్చుకున్నాడు సర్పంచ్ అందరి మధ్యకొచ్చి సీతయ్యకు, మట్టారెడ్డికి నమస్కరించి నిలుచున్నాడు

చెరువులోని నీరు గూర్చి, పారవల్సిన పొలం గూర్చి తలా ఓ మాట అంటువుంటె అన్ని వింటు నిలుచున్నాడు

"మట్టి తవ్వినోడు కట్ట పోసినోడు కనపడకుంటాయె" అంటు శివయ్య వచ్చి సాయన్న పక్కన నిలుచోని ఏమి చెపుతాడో వినాలని చూస్తున్నాడు సీతయ్యను, మట్టారెడ్డిని, చెరువును, చెరువు కింది పొలాలను అక్కడ నిల్చున్న పెద్ద-చిన్న రైతులందరిని చూస్తూవున్నాడు సర్పంచ్ సాయన్నగారు.

"సర్పంచ్ చెపితే మాకు సమ్మతమే" అన్నాడు మట్టారెడ్డి. సర్పంచ్గ సాయన్న పేరును సూచించింది తానె కనుక తన మనిషి అన్న నమ్మకం.

"అంతే గద" అన్నాడు సీతయ్య. తన పొలం తరువాతె మట్టారెడ్డిది ఆయన తన పొలం పారె పతకం ఎలాగో వేస్తాడన్న నమ్మకం

"యిక యినందెవరు మేమేనా" అన్నారు అయిలయ్య, బీరయ్య, పాపయ్య ఒక్కసారె!

'నేను సెప్పేది ఏమున్నది అందరం ఎట్లా అనుకుంటె అట్లనె" సర్పంచ్.

"ఊరు సర్పంచ్వి, నీవు ఏది సెప్పినా దానికి విలువ వుంటుంది" మట్టారెడ్డి

"అందునా నీకా చెర్వు కింద పొలం లేదు తన మన అనుకోవడానికి కాబట్టి నీ మాట సెల్లుతుంది" సీతయ్య.

"నా వొక్కని మాట ఎందుకు? నలుగురు ఎట్టా అంటె అట్లానె" సర్పంచ్.

"గందుకె నీకు తోసింది నలుగురికి నచ్చేది సెప్పు" బీరప్ప.

"నచ్చుతదో నచ్చదో నీకు తోసింది నీవు సెప్పు" శివయ్య.

అందరివైపు మరోసారి చూసి, ఎందుకో చివరి పొలం వైపు చూశాడు ఆ తరువాత తూము దగ్గరి పొలాల వైపు చూశాడు.

ముదురు పచ్చగ తలలూపుతున్నవి. సరిగా నీరందని చివరి పొలాలు కొసలు మాడి బెల్లం రంగులో వున్నవి మొత్తం చెరువు కింద పొలాన్నంత చూస్తున్నాడు

"ఈ వున్న కొన్ని నీళ్ళు అంతట పారవన్న సంగతి గూడ ఆలోచించు" సీతయ్య.

"ఏదో ఓటి చెప్పు" మట్టారెడ్డి

"ఎలచ్చన్ల ఎక్కువ ఓట్లు వస్తే గెలిచినట్టు, ఎక్కువ మంది ఏదంటె అదె" అన్నాడు. అప్పుడు ఆయన ఎవరి వైపు చూడలేదు.

ఆ మాట అనగానె సీతయ్య ముఖం చిన్నపోయింది. మట్టారెడ్డికి మాట రాలేదు

చెర్లో నీళ్ళన్ని మీది పొలం పోకుండా కాలువగుండా పోయి కింది పొలం పారుతున్నట్టు, పై పొలాలు ఎండిపోతున్నట్టు అనిపించగానె వెంటనే మాట మారుస్తూ "ఇదంత ఎందుకు, సర్కారోల్లు ఎట్ల సెప్పితె అట్టనె పాపం సాయన్నను ఎందుకు ఇరకాటంలో పెట్టాలె" మట్టారెడ్డి

సర్పంచ్‌ని చెప్పమని, ఆయన చెప్పింది వినకుండా మాట మారుస్తున్నందుకు, "ఊరు, ఊరికి ఓ పంచాయితి బోర్డు ఉన్నంక సర్కారు దగ్గర్కెందుకు? యిక్కన్నె తెంపుకోవాలె" అన్నాడు అయిలయ్య

"అంతే మరి" బీరప్ప గొంగడిని ఎగేస్తు, గొడ్డలిని నేలకు పొడుస్తూ అన్నాడు.

"ఆ సంగతి వొదిలేయి. యిప్పుడు కింది పొలం వొదిలేసినంక రేపో మాపో అనొచ్చి చెరువు నిండితే, ఎండిన పొలం మల్ల సేతికొస్తద?" అని సర్పంచ్‌గారు అనగానే అంతె అన్నట్టు కింది పొలాల వాళ్ళు తలలూపారు!

పై పొలాల వాళ్ళు మౌనంగా అక్కడి నుండి కదిలారు. వాళ్ళ వెనకాల అందరు.

* * *

ప్రభుత్వం సారా వద్దన్నా గడీలల్లో సారా కాగుతూనే వుంది మట్టారెడ్డి పటేలు గడిలో అందరూ కూడి కాపుసార తాగుతూ కూర్చున్నారు సేవకపు రాములు అందరికి

సారాయి పంచుతు చిట్టుల్వలను, కారపు శనిగలను ఆకులలో అందిస్తున్నాడు

మట్టారెడ్డి తల నిండా ఆలోచనలే! సీతయ్య మట్టారెడ్డి మనస్సులో మంటను రాజేస్తున్నాడు

"సాయిలును నమ్మితే లాభం లేదు ఏదో ఒకటి అనేసినంక దాన్నే నలుగురు సయి అన్నంక తొలగటానికి వీలుండదు" దూరంగ దర్వాజ దగ్గర గోడ నీడన కూర్చున్న శివయ్యను దగ్గర్కిరమ్మని సైగ చేస్తు తాను బంకుల్ల నుండి బయటి దర్వాజ వైపు నడిచాడు. మిగతా వాళ్ళు సారాను మింగుతు పొంకనాలు కొడుతున్నారు.

"దొరల పొలాలు పండితె నాలుగు రోజుల కూలైన దొరుకుతుంది" అన్న మట్టారెడ్డి మాటలు మరి మరి గుర్తుచేసుకుంటు -

"కూలోని దగ్గర్కి కూలీకి పోకూడదట, పాలోని దగ్గర్కి పనికి పోకూడదట ఆకరి పొలాలు పారినా మనకే మొరుగుతుంది" అంటు నవ్వుకుంటున్నారు.

సీతయ్య, మట్టారెడ్డి మాట్లాడుకున్నారు

సాయన్న కోసం కబురుపంపి, ఆయన ఊళ్ళో లేడు, పట్నం వెళ్ళాడని, రెండు మూడు రోజుల దాకా రాడని కూడ తెలుసుకున్నారు

కూలి చేసుకునే అందరికి ఆ రాత్రి కూలి దొరికింది.

గొడ్డల్లు నూరుకుని ఊరు చుట్టు నాలుగు వైపుల నడిచారు

మరునాడు సర్పంచ్ భార్య ఎంకమ్మ, సీతయ్య దొర ఇంటి ముందు నెత్తి కొట్టుకుంటూ నిలుచోంది దొర ఊళ్ళో లేడని, తిరపతికి పోయిండని సేవకపు రాములు చెప్పాడు. మట్టారెడ్డి ఇంటి ముందు రొమ్ము బాదుకుని మొత్తుకుంది. ఆయన ఏదో పార్టీ సభని పట్టణంలో ఉన్నాడన్నారు దిక్కు తోచని స్థితిలో ఊరంతా తిరుగుతు ఏడుస్తూ వుంది

సాయిలుకున్న సర్పంచ్‌గిరి వద్దని చెపుతు వాడ వాడ తిరిగింది, మనిషి మనిషికి చెప్పింది.

ఆమె స్థితిని చూసి సాటి ఆడవాళ్ళు అంగలార్చుతు ఆ రోజు చెట్లు నరకడానికి వెళ్ళిన తమ తమ మొగలను, ఎనక ముందు ఎరగని ఎర్రోల్లని, తమ చేతులని తామే నరుక్కునే మూర్ఖులని తిట్టిపోసారు. ఆ రోజు తెల్లవార్లు గొడ్డళ్ళ చప్పుడు చెట్లు కూలుతున్న శబ్దం గుర్తొచ్చి, అన్యాయం అంటె అన్యాయం అన్నారు.

అడవిలో అర్ధనగ్నంగా తిరుగుతున్న సాయిలు నర్కివేయబడ్డ ఈతచెట్లను చూస్తువున్నాడు. చేతిలో కొడవలి. చెదలు పట్టిన ఈత మట్టలను చూస్తూ మూగగా ఏడ్చాడు

మళ్ళీ ఓ చెట్టు పుట్టి మట్ట పెరగడానికి ఎన్నేండ్లు కావాలి? అప్పటి వరకు తాను ఏంచేసి బతకాలి? మరోపని ఏదీ రాదు. మడి మాన్యాలు లేవు. తాత, తండ్రి ఇదే పని చేస్తు వచ్చారు. తాను ఇదె పని. ఈత చెట్లె తమ ధనం, ధాన్యం. ఈత చెట్లె బతుకు! తన బతుకులో ఎందుకు నిప్పులు పోసిండ్రో

సాయిలుకు అర్థం కాలేదు సర్పంచ్ కావటమే నేరమైపోయి నట్టుంది యింతకు ముందు సీతయ్యదొర సర్పంచ్ సేస్తే సర్పంచ్ దొరన్నారు సర్కారుగాలికి తనను సర్పంచ్ చేసి అతి కష్టంగా సాయన్న అన్నారేగాని, సర్పంచ్ సాయిలు అని గూడ ఎవరు పిలవరైరి. పిలవకుంటె పిలవకపోయిరి, తన నోట్లో మన్ను ఎందుకు పోసినట్టు?

"కాపు సార మత్తులో ఈత చెట్లన్ని నర్కేసింన్రు కాని ఈ వూరోల్లకు కల్లు కరువౌద్దని మర్సింన్రు" అని తెల్లారి ఓ పండు ముదుసలి గుర్తు చేసేసరికి అందరు నోరు తెరిచారు

"తట్టలు - తడికెలు, గంపలు - గుమ్ములు ఏం బెట్టి అల్లుతరు, పరాయి ఊరే గతి అయినా ఏం పోయే కాలమిది? కూలికి యిసం తాగటం అంటె గిదేనేమో?" అంటూ ఆడవాళ్ళు నోళ్ళ మీద చేతులేసుకున్నారు అంతేగాదు "తాగిన నోరు ఆముదాలు బుక్కిందట" అంటు మగవాళ్ళకు చురకలు వేసారు చేసిన పనికి లెంపలేసుకున్నారు పటేలోని పన్నాగానికి పళ్ళు కొరికారు. దోరోని మోసానికి బుసలు కొట్టారు. సాయిలు, సాయిలు భార్య ఎంకమ్మ మాత్రం ఊరొదిలిపోయారు

* * *

నాలుగు రోజుల తరువాత -

ఓ గుంపు ఆవేశంలో రక రకాలుగ మాట్లాడుతు వొచ్చారు

క్రితంలో వాళ్ళు -

"అయ్యా నీ బాంచలం"

"తండ్రీ నీ కాల్ మొక్కుతం"

"మహాతండ్రీ నీ గులాపోల్లం"

"కల్లాలు చల్లగుండాలె, తమ రాసులు పెరగాలె, సాలెడు గింజలు సెప్పుండ్రి" అంటు కాళ్ళ వేళ్ళ పడె అర్ధనగ్నపు మగవాళ్ళు గుంపుగ మట్టారెడ్డి గడి ముందు నిల్చున్నారు. వాళ్ళ, వాళ్ళ చేతుల్లో వాళ్ళ వాళ్ళ పనిముట్లున్నాయి వాళ్ళ వెంటవున్న వాళ్ళ కుక్కలు తమ తమ యజమానుల ఆందోళనను పసిగట్టి గడి వైపు చూస్తు మొరుగుతున్నాయి. గడి లోపలి అరిచే కుక్క చప్పుడు ఊరంతా వినిపిస్తుంది ఆ చప్పుడు మన ఊరకుక్క చప్పుడున్నట్లు లేదు

అడవి జెంతువు గాండ్రించినట్టుంది

"పటేలు బయటికి రావాలి" .. ఒకడు

"ఈత చెట్లను ఎందుకు నరికేస్విన్రో సెప్పాలి ... " మరొకడు

"భూమాత యిచ్చిన చెట్టును గీసుకొని కల్లో, నీల్లో అమ్ముకొని బతికేటోల్లం ఇగ ఇప్పుడెట్ల బతకాలె" అంటు గీత పనివాళ్ళ ఆందోళన.

అన్నీ వింటూ అనుకోని ఈ తిరుగుబాటుకు ఖంగుతిన్న మట్టారెడ్డి ఏటూ తోయక దిడ్డి దర్వాజ గుండా తన మనిషిని సీతమ్మ ఇంటికి పంపించాడు.

కొంత సేపటి తర్వాత అతను తిరిగొచ్చి వణుకుతున్న గొంతుతో

"అక్కడి పరిస్థితి ఇంకా గందరగోళంగా వుంది అక్కడంత ఆడోల్ల గుంపు'

"అమ్మా బుక్కెడు సలి బువ్వ"

"తల్లీ ఓ పాత చీరె"

"ఈ సాపలో ఏ సాప కావాలో సూడుండ్రి తల్లి" అంటూ, అందరి వాకిల్లలో, అల్లుకొచ్చిన ఈత సాపలను పరిచి, వాళ్ళిచ్చింది తీసుకొనేటోల్లు - ఈయల్ల వాళ్ళ మాటలే మారిపోయినయి.

"అదె మేం బతుకొద్దా, దొరలు, పటేండ్లే బతుకుతర" ఒకరు.

"ఆల్లకు ఎకరాల కొద్ది పొలాలు, సెలుకలున్నయి" మరొకరు

"మాకేముంది, రెక్కాడితే డొక్కాడె" ఈతాకుతో చాపను అల్లుతు ఓ స్త్రీ

"ఈతాకు మా బువ్వ, ఈతాకు మా బట్ట" మరో స్త్రీ

ఆమె చేతిలో ఈతాకులు, అంతకు ముందు అల్లిన చాప చుట్ట చేతికి వేలాడుతుంది

వాళ్ళ మధ్యన నడుం కట్టుకుని వాళ్లు అనే మాటలను బలపరుచుతు, అనవల్సిన మాటల నందిస్తు నిలుచుంది ఎంకమ్మ. ఇల్లు ఎల్లని దొరసానులు జరుగుతున్నదేందో

అర్థంకాక చూస్తూ నిలుచున్నారు

ఏదో జరగనున్నదని గ్రహించిన సీతయ్య గరిసెలోకి దిగి సెవులను వాకిలి వైపు వుంచాడు 'ఈదులూ, ఓ రకం చెట్లు, చెట్లనే కొట్టేయిస్తున్నాం అనుకున్నాం కాని చెట్టు, చెట్టెనుక మనుషులున్నరన్న విషయం అప్పుడు ఆలోచించలేదు' అని తల పట్టుకున్నాడు సీతయ్య - అని అక్కడి పరిస్థితి పూసగుచ్చినట్టు చెప్పాడు

"ఈళ్లంతా ఎక్కడోళ్లు ఎందుకొచ్చిండ్రు" గొంతు చిన్నగా చేసి అడిగాడు మట్టారెడ్డి

"యినొస్తలేదా పటేలా, ఈతచెట్లు కొట్టినందుకే!

కల్లుగీత పని పోయిందని గౌండ్లోండ్లు, ఈతాకు లేకుండైందని పిచ్చ కుంట్లోల్లు, తడకలు - తట్టలల్లుకునే ఎరకలోల్లను అందర్నీ సాయన్న లేపుకొచ్చిండంట!"

"అమ్మో! ఒక్క చెట్టు ఎనక మూడు కులాలున్నాయన్న మాట" బయం బయంగా అని -

"అచ్చా ఆ మొరిగే కుక్కలు"

"ఆల్లయే"

"అట్టనా మన టైగర్ని వొదులు" మీసాల్ని దువ్వుతూ అన్నాడు. 'సరే' అన్నట్లు తల వూపి కుక్క మెడకున్న గొలుసును తీసాడు ఆయన మనిషి

టైగర్ ఒక్క ఉదుటున పరుగెత్తి గడి దర్వాజ దగ్గర నిలుచొని బయటి వాసనను పసిగడుతూ ముందలి కాళ్ళతో

తలుపును గీరసాగింది.

"ఊఁ కానియ్, అన్నిటిని కొరికెయ్, వాళ్లందర్నీ తరిమెయ్" అంటూ సైగ చేశాడు మట్టారెడ్డి

ఆయనతో వున్న మనిషి వెళ్ళి గడి తలుపులు కాస్త తెరిచాడు టైగర్ వెళ్లి వాకిట్లో వున్న కుక్కల మీద పడ్డది

అనుకోని సంఘటనకు అందరూ బొమ్మల్లా నిలుచుండిపోయారు. ఆ తరువాత కొందరు తమ చేతుల్లోని కొడవళ్ళను విసిరారు

తెలివైన కుక్క తప్పించుకుంది

ఆ తరువాత ఓ బక్క కుక్కను కసిగా చీల్చి పడేసింది

మట్టారెడ్డి మరో మీసం దువ్వాడు

యింకో కుక్కను మెడ పట్టి నేలకు గొట్టింది టైగర్

బక్క కుక్క కుయికుయ్యిమంటూ ప్రాణం వొదిలింది

తలుపు సందులోనుండి చూస్తున్న మట్టారెడ్డి పడిపడ నవ్వసాగాడు

అది చూస్తున్న మనుషుల కళ్ళు ఎరుపెక్కినయ్

ఒక్కసారే నోట్లో వేళ్ళుంచి ఈలలు వేసారు

మిగిలిన కుక్కలు తోకలను పైకి లేపి, ముందలి కాళ్ళతో వాకిలిని పెగలగీశాయి

మరొకసారి ఈలలు వేశారు.

అంతే -

బక్క కుక్కలన్ని టైగర్ మీద పడ్డాయి

భాష కందని శబ్దం చేస్తూ అందిన చోటును అందుకున్నాయి
క్షణంలో టైగర్ ఊర కుక్క నోళ్ళల్ల రక్తం వొడుస్తున్న మాంసం ముద్దలుగ మారిపోయింది

మట్టారెడ్డి నోరు తెరిచి చూస్తుండిపోయాడు

ఏప్రిల్ 1995 రచన

# పాము

కోడి కూసింది ఊరు లేచింది. చెట్ల మీద పక్షులు అరుస్తు వున్నాయి దొడ్లల్లో పశువులు కదులుతూవున్నాయి

నారాయణ మాత్రం యింకా నిద్రలేవలేదు

"అయ్యో నారిగాడు సచ్చిండట"

"మంచం మీద పండినోడు పండినట్టే జీవిడిసిండట"

"కొట్టిన గుర్తులు లేవు కోసిన గుర్తులు లేవు"

"అవును నిద్రపోతున్నట్టే వున్నడు"

"ఎట్ల సచ్చిండట?"

"పాము కరిసి అంటుండ్రు"

"పాపం నారిగాడె సచ్చిండు"

"పురుడునాడు పెట్టిన పేరు నారాయణ
పెరుగుతువుంటె పిలుస్తున్న పేరు నారిగ
ఇపుడు ఆ రెండు పేర్లు ఆరిపోయినయి"

"వూరి దొర ఏమంటుండో" గుంపులోని ఓ పెద్దమనిషి ప్రశ్న

"చిన్నపుడు తల్లి ఆకిలి ఊకుతుంటె, ఆకిలి చివర్న పేడను కూడేసేది కాస్త పెరిగినంక రేల ఆకును నోట్లో పెట్టుకుని ఈల వేస్తు మా గొర్రెలను, మేకలను మలుపుతు వాటి పిల్లలకు పాలు కుడుపేది పెద్దయినంక తండ్రి అరక ఎనక వాని అరకను నడిపేది బండి కడితే కోడెలను దౌడు తీయించేది. వాడు మా దగ్గర పెరిగినోడే, ఈయల్ల పాము కరిసిందని బయట పెడితిమా పోలీసు కేసయితదని అంటున్నాడు దొర" అప్పుడే అక్కడికొచ్చిన సర్పంచ్ సమాధానం సర్పంచ్ దొర పంజరంలోని చిలుక

అదే మాట వాకిళ్ళు దాటింది వాడలు దాటింది. పొద్దు బారెడెక్కే వరకు ఊరంతా పాకింది

నారాయణకు పేళ్ళీడు వచ్చినా దొర అప్పు ఇవ్వ లేదు.

ఇచ్చినా యియ్యకున్నా ఈ ఏడు కొడుకు పెళ్ళి ఎట్లనన్న సెయ్యాల్సిందే అని ఈ మధ్య తండ్రి రాజయ్య అంటువుండె

"పోలీసుకేసయితే పీనుగను పగలజిరవల్సి వస్తది" గ్రామాధికారి ప్రకటన

"సచ్చినోడైతే రాడు గదా, నవిసే సచ్చిండు నా కొడుకు"

అడిగిన వాళ్ళతో అన్నాడు రాజయ్య

మాల వాడంతా నోరుమూసుకున్నా, కళ్ళు మాత్రం కన్నీటిని కారుస్తునే వున్నాయి. రాజయ్య కొడుకును తలచుకొని తలచుకొని ఏడుస్తున్నాడు తల్లి చచ్చినంక తను కంటికి రెప్పలగా కాపాడుకొన్నది చెప్పుకొని చెప్పుకొని ఏడుస్తున్నడు "సెయ్యేత్తు కొడుకు సాటంత సాతీ" అంటు రొమ్ము కొట్టుకుంటు వున్నొక్కడు పోగ అన్ని శక్తులు ఉడిగిపోయి కుప్పకూలి పోయిండు రాజయ్య

★ ★ ★

అది దొర భవంతిలోని మధ్యహాలు. అందులో అంతకంటు ముందు తరం వాళ్ళు చేయించిన నగిసీలు చెక్కిన కుర్చీలు వేసి వున్నాయి వాటికి ఎదురుగ టీ పాయ్ వున్నది ఆ హాల్లోని గోడలకు వాళ్ళ వంశస్థుల ఫోటోలు వున్నాయి

సాయంత్రం వేళ

భవంతి చుట్టువున్న రకరకాల చెట్లు, పూలు, అవి వెదజల్లే పరిమళాలు. పెద్ద దొరసాని మల్లెలను మాలగ అల్లుతు ఓ కుర్చీలో కూర్చున్నది పని మనిషి ఓ పల్లెంలో మామిడి పండ్లు తెచ్చి టీ పాయ్ మీద పెట్టి దొరసాని మాట కోసం చెవులుంచి, సైగ కోసం కళ్ళుంచి నిలుచుంది

"రామి, పంతులు వస్తున్నాడేమో చూడు" అల్లుతున్న పూలవైపు చూస్తు అన్నది. పని మనిషి అక్కడి నుండి కదిలి

బయటికి నడిచింది వెళ్ళినంత వేగంగా తిరిగి వస్తూ

"వస్తుండు దొరసాని"

ఆమె వెనకాల పంతులు

ఏబది ఏండ్ల నుదుట విభూతి, మెడలో రుద్రాక్షమాల నిండైన భుజాల చుట్టు హరే రామ హరే కృష్ణ అని ప్రింటు చేసిన పసుపురంగు కండువ. ముఖంలో ముసి ముసి నవ్వులు పంతులు రాకను గమనించి దొరసాని లేచి నిలుచోని నమస్కరించింది

పంతులు కుడి చేతిని ఎత్తి, ఆమెను ఆశీర్వదిస్తున్నట్టు కదిలించి, తాను ఎదుటి కుర్చీలో కూర్చున్నాడు.

"రామి, చిన్న దొరసాన్ని తోలుకరా" అంది లోపలివైపు చూస్తు

"దొరవారు లేనట్టుంది" భుజం మీది కండువను సరిచేసుకుంటు అడిగాడు

"పట్నం దాక పోయిండు కొంగును భుజం చుట్టు సరిచేసుకుంటు అంది ఈ లోపల పనిమనిషి చిన్న దొరసానిని తోలుకొని వచ్చినంది

"రా, రా, అలా కూర్చో" అంటు ముసి ముసిగ నవ్వాడు.

తన పెళ్ళి జరిపించిన పెద్దమనిషి అని గుర్తించి చేతులు జోడించి నమస్కరించింది ఆ తరువాత అత్తగారి వైపు చూపు నిలిపింది

"పరవాలేదు కూర్చో" అంది.

తలవంచుకొని కూర్చున్న చిన దొరసానిని చూస్తూ

"ముహూర్తం అవసరమే" అంటు పెద్ద దొరసాని ముఖంలోకి చూపులను మళ్ళించాడు. చిన దొరసాని సిగ్గుతో తల వంచుకుంది

పెద్ద దొరసాని పెదాలు కదలి నవ్వుల అలలు ఆమె విశాలమైన కళ్ళలో మెరిసినయి

"సూడండి, బాబు రావడానికి లేదు లేదన్నా నెలపడతది ఆ తరువాత ఎన్నడు మంచి రోజో చూసి సెప్పండి" అంటు పంతులు ముఖంలోకి చూసింది

ఏదో శ్లోకాన్ని చదివి వ్రేళ్ళమీద మరేదో లెక్కిస్తూ -

"పేరు"

"ఎవరిది కోడలిదా, నాదా" అనుమానంగ అడిగింది

"కోడలమ్మదే, అవునూ మీపేరుకూడమరిచిపోయాను పిలుస్తుంటేనే పేర్లు గుర్తుండటం కష్టం. అందరు దొరసాని అని అంటువుంటే ఇక అసలు పేరు ఎక్కడ గుర్తుంటుందీ" అంటు కాస్త విసుక్కున్నాడు. అది గమనించిన దొరసాని "చాదస్తపూ" అని మధ్యన్నే ఆపి పెదవులు కదిలించింది

పంతులు ముఖం విప్పారింది.

"బాబు పేరు తెలుసు" అంటు ఓసారి కళ్ళు మూసి తెరిచి. . .

"కోడలమ్మ పేరు మొదట ఏదో వుంటె ఒరుగుల్లు కలవవని పెళ్ళపుడు మార్చాము అనుకుంట" చూపుడు వేలును

ముక్కుమీద ఆనిస్తూ అన్నాడు

"అవును" అన్నట్టు తలవూపింది అప్పుడు ఆమె మెడలోని ముత్యాలహారం కదిలి కొండల మధ్య సెలయేరును గుర్తుకు తెస్తువుంది

"లోపలికి తీసుకెళ్ళి పుట్టుమచ్చలు చూసి చెప్పండి." అంటు మధ్య మధ్య ఏవో శ్లోకాలను వళ్ళిస్తూనే వున్నాడు

దొరసాని పనిమనిషికి సైగ చేసింది. పనిమనిషి చిన్న దొరసానిని పక్క గదిలోనికి తీసుకెళ్ళింది.

నిలువెల్ల సిగ్గు ఆవరించగ గోరింటాకు పండిన చేతులను చూసుకుంటు నిలుచుంది చిన దొరసాని చీరెను తొలగించు అన్నట్టు చూసింది పనిమనిషి

"అది పైన పైన చూస్తుందేమో మీరు వెళ్ళి వళ్ళంతా చూడండి" అనగానే వాళ్ళ వెనకాల వెళ్ళిన పెద్ద దొరసాని, ఆ తరువాత ఆందోళనగా వచ్చి కూర్చుంది ముఖం మీద చిమ్ముకొచ్చిన స్వేదానికి నుదుట వున్న కుంకుమ బొట్టు కరిగి ముక్కు మీదికి జారింది నోటికి అడ్డంగ కొంగును అదిమి పట్టుకున్నా కళ్ళల్లో నీరు నిండి కొలుకుల దగ్గర జారడానికి సిద్దంగా వున్నాయి.

అసలు సంగతి గ్రహించి ఆమె స్థితిని గమనించిన పంతులు "ముందే చూడలేదా" పంతులు కుర్చీలో వొరిగి కూర్చుంటు అడిగాడు. అప్పుడతని రెండు చేతులు తలవెనక పెనవేసకున్నాయి.

"నలుగు పెట్టేటపుడు గమనించలేదా?"

లేదన్నట్టు తల వూపింది

"చిన్న దొరకు ప్రాణగండం" అంటు నేలవైపు చూశాడు

పూర్తిగ మొద్దుబారిన మనస్సుతో శూన్యంలోకి చూస్తుండి పోయింది అప్పటి వరకు ఆమె కనుకొనల్లో నిలిచిన కన్నీరు బొట్లు బొట్లుగా రాలుతున్నాయి

"అయినా ఏం కాదు శాంతి చేయిస్తే చాలు" అంటు వేళ్ళ మీద ఏదో లెక్కిస్తు పై వాసాల వైపు చూశాడు

సరే అన్నట్టు తల వూపింది

పంతులు నింపాదిగ చూస్తు దొరసాని వైపు వంగి చెవిలో ఏదో చెప్పాడు. అది విన్న దొరసాని ముఖంలో ఏవేవో మార్పులు కదలాయి వొప్పుకున్నట్టుగ తలఆడించి మౌనంగ ఆలోచిస్తు కూర్చుంది

"ఈ శర్మగారు వున్నంక మీకెందుకు పరేశాన్" జంద్యాన్నొకసారి కదిలిస్తు అన్నాడు.

ఒక్కసారే తన కోడలి పెళ్ళి చూపుల రోజు గుర్తుకొచ్చింది. పిల్ల పుత్తడి బొమ్మ నడిస్తే పొద్దు తిరుగుడు పూవు, నవ్వితే మల్లె పందిరి !

"చూడండి అంతా వాడి లీల, మన చేతిలో ఏముంది? కొడలిని వదిలేస్తే చెడ్డపేరు బాబును ఏ రకంగానైనా బతికించుకోవాలి" ఎంతో ఆసక్తిగ అన్నాడు.

అవును అన్నట్టు తలవూపింది దొరసాని.

"అందుకే పూర్వీకులు యిలాంటి పరిస్థితి వస్తే కొన్ని పద్ధతులు పెట్టారు, వాటిని అందరు పాటించవలసిందే"

సాంప్రదాయాల ప్రతినిధిగా శాసించినట్టు చెప్పి లేచాడు

పెద్ద దొరసాని సరే అన్నట్టు తలవంచుకుని

"ఒకే ఒక్క కొడుకు వానికి ప్రాణగండం!" అనుకుంటు తన అరచేతిలోని గీతలను చూస్తూ కూర్చుండిపోయింది

★ ★ ★

"నారిగా" వసారాలో నిలుచొని పిలిచింది

"దొరసాని" చేతులు కట్టుకుని దొర భవంతి ముఖ ద్వారము దగ్గర నిలుచున్నాడు

"చిన దొరసాని నిన్న తల్లిగారింటి నుండి వచ్చిందిరా"

"మరి చిన్న దొర ఎప్పుడొస్తడో"

"వస్తడు, తోటలు లూటి అయిపోయినంక" అంటు నారాయణవైపు చూసింది

"ఈ లోపల నీవు చిన దొరసానికి ఈత నేర్పాలిరా" అంటు తన రెండు చేతులను వెనక్కు పెట్టుకుని నిలుచుంది

"నేనా దొరసాని" కలవరపడుతూ అన్నాడు

"ఆః నీవేరా" అంటు నారాయణ కలవరపాటును చూస్తూ లోలోపల నవ్వుకుంది

"ఇల్లెల్లని దొరసాని బాయిల ఈత" అంటు నసిగాడు నేలను చూస్తు.

"ఏమైతదిరా" కొంచెం ముందుకొచ్చి ద్వార బంధాన్ని పట్టుకుంటు అడిగింది

ఏంకాదు అన్నట్టు తలాడించి -

"చూసేటోల్లు" మాట పూర్తికాకముందే

"మన గురించి ఏదో అనుకునే ధైర్యం ఈ పూల్ల ఎవరికుందిరా" అంటు అతన్ని, అతని వెడల్పయిన ఛాతిని చూస్తు, తన కొప్పును ఓసారి బిగ్గరగా గుంజి వదిలింది.

"కాల్లు సేతులు" అంటు భయంగ చూశాడు

"ఆడించడమే ఈతరా" కనుబొమ్మలు ఎత్తి పట్టి అంది

"అట్టకాదు" అంటు ఆతురతతోచూశాడు.

"మరెట్టనో సెప్పు" అన్నట్టు కళ్ళతోనే అడిగింది.

"కాల్ సేతులు తగులుతయేమో అని" అంటు నసిగాడు

"నేను సెప్పుతున్న నేర్పు" నడుం మీద చేతులు పెట్టుకుని శాసించినట్టు చెప్పింది

అప్పుడామె కనురెప్పలు నిలబడి కనుగుడ్లు పెద్దగ కనిపించినయి. నారాయణ ముఖం చిన్నబోయినట్టు కాగ గోళ్ళు గిల్లుకుంటు మౌనంగ నిలుచున్నాడు

"నీ వొల్లు బలిసిందిర సెపితే యినేటట్టు లేవు" అంటు నిష్ఠూరంగ తల ఆడించింది.

"సిన్న దొరొచ్చి కొడితే" ముఖంలో భయం

"నేనెక్కడికి పోతర" అంటు కళ్ళను ఓసారి మూసి తెరిచింది

"మరి పెద్దొర" కళ్ళలో బెదురు

"నామాట కాదంటాండ్ర" అంటు చిన్నగ నవ్వింది.

ఏం చెప్పాలో తెలియక దొరసాని ముఖంలోకి అమాయకంగ చూస్తు నిలుచున్నాడు

"చెప్పింది చెయ్యర దున్నపోతు" అంటు పళ్ళు మీద పళ్ళుంచి లోపలికి నడిచింది నారాయణ బయటికి నడిచాడు. తలనిండా ఆలోచనలు, మనసు నిండా చెప్పుకోలేని భయం.

మరునాడు పొద్దు పొడుస్తున్న సమయం

దొర యింటి వెనుక దిగుడు బావి వైపు నారాయణ నడక, సంకలో ఆముదపు లొట్టల కట్ట వెనకాల దొరసాని, చేతిలో పొడి బట్టలు

మొదటి రోజు భయం !

రెండవ రోజు సిగ్గు !!

మూడవ రోజు ముచ్చట !!!

రోజు పొద్దున్నే బావిలోని నీళ్ళు వెచ్చగ వెచ్చగ వుండి ఈత మీద యిష్టాన్ని కలిగించాయి.

నారాయణ కోసం, తన తల్లిగారు పంపిన సారెలో నుండి గరిజెలను దాసుకొచ్చి యిస్తూ. . నిన్న లొట్టలు తెగినప్పుడు బొడ్డుకింద చెయి వుంచి బతకమ్మను ఎత్తి పట్టినట్టు ఎత్తి పట్టింది గుర్తుకొచ్చి . .తనను తాను మరిచి -

"లొట్టలు లేకుంటెనే ఈత తొందరగ వచ్చేటట్టుంది" అని అన్నప్పుడు నారాయణకు చిన్నప్పుడు అరచేతిలో తిరిగిన

బొంగరం గుర్తొచ్చింది. తనను తాను మరిచి -

ఆ తరువాత ఆమె లొట్టలను కట్టుకోనే లేదు చేతుల మీదే ఈత నేర్చుకుంది.

ఈదడం వల్లనేమో వళ్ళు చేసి శరీరంలో నునుపుతనం, కళ్ళలో కాంతి, ముఖంలో కళ కొట్టొచ్చినట్టు కనబడుతువుంది

నారాయణ మాత్రం నాలిముచ్చులా మారిపోయాడు !

గండం గడించిందికాని నారిగాడు బతికే వున్నడు!

మరి పంతులు అట్లెందుకు చెప్పినట్టు " పెద్ద దొరసానిలో ప్రశ్నల పరం పర ! కొత్త దిగులు ! ఏ క్షణం ఏమౌద్దో అన్న భయం చిన్న దొరసాన్ని ఈతకు వెళ్ళొద్దు అని ఆంక్షలు.

ఈతకు వెళ్ళొద్దు అన్నందుకు చిన్న దొరసాని చికాకులో చిక్కుకొని పరాకుగా వుంటు వుంది. అది గమనించిన పెద్ద దొరసాని, చిన్నదొర రాగానే ఇద్దరిని ఆమె తల్లిగారింటికి పంపి ఎంతో బరువును దింపుకున్నట్టు శ్వాస పీల్చుకుంది

★ ★ ★

దీ పాలు వెలిగిస్తున్న వేళ్ళ ...

పడక కుర్చీలో దొర, పక్కన్నే తుంగ చాపలో దొరసాని కూర్చున్నారు. వాళ్ళ ముందు ఓ ముక్కాలు పీట నుంచి దాని మీద చిన్న గ్లాసులను పెట్టి సారా సీసాను పక్కమ్మటే వుంచి తాను అక్కడి నుండి తప్పుకున్నది మనిమనిషి. దొరసాని మౌనంగ కూర్చున్న ఆమె గుండెల్లో ఏదో గుబులుగా వున్నట్టే

బరువైన చూపులు, తన ఒక్కగానొక్క కొడుక్కి కీడు జరగొద్దని తన ఉద్దేశాన్ని పెద్ద దొర గుర్తించినట్టు లేదు. దొర గ్లాసుల్లో కాపుసార వొంపుతు-

"కంట్లో నలుసుపడితే ఒక్క కంటికే కాదు బాధ, ఒంటికంతా బాదే" అంటు ఓ గ్లాసును ఆమె కందించి, తానొకటి తీసుకుని, ఒక్కసారే నోట్లో వేసుకుని కాళీ గ్లాసును పీట మీద వుంచాడు. దొరసాని చేతిలో వున్న గ్లాసులోనికి చేస్తువుంది.

"చిన్న దొర కొడితే" అంటు కదిలింది అమాయకపు ముఖం.

ఓసారి కళ్ళుమూసి తెరిచింది.

"మరి పెద్దదొర" అదే ముఖం.

"నేను సెప్పినంక" అని గుర్తుకు రాగానే ఆమెలో ఏదో వణుకు మొదలైంది.

తాగు అన్నట్టు సైగ చేసి మీసాలను అద్దుకున్నాడు దొర.

అప్పుడు ఆమె ఓసారి దొరవైపు చూసి, మళ్ళి గ్లాసు వైపు చూస్తూ వుంది. వేయించిన ఎండు మాంసపు ముక్కలున్న పళ్ళాన్ని తెచ్చి పీట మీద పెట్టి వెళ్ళిపోయింది, పనిమనిషి

దొర ఓ ముక్క నోట్లో వేసుకుని నములుతు... .

"ఊర్లో చావు జరిగితే తప్పక తాగాలి" అంటు కుర్చీలో వెనక్కు వొరిగాడు. అప్పుడు ఆయన ఎదమీద, బంగారు గొలుసు కప్పను మింగి పచ్చికలో పడుకున్న నాగుపాములా వుంది.

"తాగితే" మాట పూర్తి కాకముందే..

"మరపు వొస్తది" సారావల్ల వచ్చిన బేవరింతకు ముక్కుల్లో నుంచి ఘాటైన ఆవిరిలాంటిది వొచ్చి కళ్ళలో నీరు నిండి మెరిసినయి

"తప్పు మాసిపోతుందా ?" అమాయకంగా అడిగింది.

"నోరుముయ్" కుర్చీలో నిటారుగ కూర్చుంటూ అన్నప్పుడు ఆయన కళ్ళు చింతనిప్పులయ్యాయి.

"మూస్త, ముయ్యకుంటె . . . మూస్తరుగద" అంది దుఃఖాన్ని మింగుతూ..

"తప్పుడు పనులు చేస్తే తప్పక మూస్త, నీవు చేసిన పనికి నీ నోరే ముందు ముయ్యవలసింది".

"పంతులు ప్రాణగండం అంటేనే".

"అంటె నీ కొడుకు బతికి యింకోడు సావాలంటవ్" మాటల్లో కరకుతనం చూపుల్లో చులకన.

దొరసాని ఏం మాట్లాడలేదు.

"ఇప్పుడు జరిగింది అదే" అంటు అక్కడి నుండి లేచి వెళ్ళాడు.

"బయట అందరికి తాగొద్దు అని సెప్పుతు యింట్లో తాగేది ఏందో" అంటూ తన చేతిలోని గ్లాసును పక్కకు పారపోసింది.

మనుషుల మధ్య వున్న మూఢనమ్మకాలను, అడ్డుపెట్టుకొని ఒక మనిషి మరొక మనిషిని మోసం ఎందుకు చేస్తున్నాడో ఆలోచిస్తూ కూర్చుండి పోయింది.

★ ★ ★

"నారిగాని పెండ్లి కాలేదు. కనుక ఒంటిపాడే అన్నాడు పంతులు.

"పంతులు గారి మాట దాటేదేలేదన్నారు అందరు

"అంతేకాదు కాదంటే ఈ వూరు మీద వర్షాలు పడవు" అని కూడ అన్నాడు. నారయణకు కట్టిన ఒంటిపాడెను వల్లకాడుకు మోసుకపోతున్నారు అది చూసి పంతులు నాలిక కర్చుకుని..

"అన్నట్టు నారిగాన్ని పామే కరిచింది, వట్టి పాము కాదు తొడపాము"! అని తనలో తాను అనుకుంటు గుడి వైపు నడుస్తున్నాడు. "నారిగాని చావుకు కారకుడివి నీవే" అని అరిచినట్టు అనిపిస్తే ఆగి ఓసారి చుట్టుచూసి వణుకకుతున్న వల్లు బిగపట్టుకొని, పై పంచతో ముఖాన్ని అద్దుకున్నాడు.

"కాదు, కాదు పెద్ద దొరసానే" అని గట్టిగ అన్నాడు.

ఆ శబ్దానికి, చెట్టు మీద వున్న కాకి ఎగిరొచ్చి "కావు కావు" మంటు తలమీద తన్నిపోయింది !

అనుకోని సంఘటనకు అదిరిపడ్డ పంతులు... నడకలో వేగాన్ని పెంచాడు.

అక్టోబర్ 1995

# దొరసాని

ఆ వూరు పక్కమ్మటి పాడుబడ్డ దేవాలయం దానికి కొంత దూరంలో వరుసగా మూడు గదులున్న పెంకుటిల్లు. మధ్య గదినే ముందుకు పెంకులతో పొడిగించబడ్డ వరండా వాకిట్లో ఓ వేప చెట్టు మూడు వైపుల కాంపౌండ్ గోడ

వరండాలో వాలుకుర్చీలో రామయ్య పంతులు, పక్కన్న బార్య సీతమ్మ భర్త ఉత్తరాన్ని చదువుతూ వుంటే, వింటూ మధ్య మధ్యన బరువుగ నిట్టూరుస్తువుంది

"*మమ్మలిని యింతవరకు చదివించారు చాలు, మా పెళ్ళిల్ల గురించి బాధ పడకండి*" ఈ వాక్యంతో, చదువుతున్న రామయ్య కళ్ళల్లోను, వింటున్న సీతమ్మ కళ్ళల్లోను నీళ్ళు తిరిగాయి

"ఓ ప్రైవేట్ స్కూల్లో చిన్న ఉద్యోగం దొరికింది. మరో మంచి ఉద్యోగం గురించి ప్రయత్నం చేస్తువున్న"

- మీ కూతురు,

మానస.

ఉత్తరం మడిచి పక్కన పెట్టి రెండు చేతులను తలకింద పెట్టుకొని వాసాల వైపు చూస్తూ వున్నాడు

"ఉన్న కాస్త ఆస్తి చదువులకే ఊడ్చుకుపాయె పై చదువులు వద్దంటే వినరైతిరి" అంటు బాగా అరిగిపోయిన కాలి మట్టెలను అటు యిటు తిప్పుతూ వేళ్ళకు పడ్డ గంట్లను రాస్తూ అన్నది

"జరగాల్సినదాన్ని గూర్చి చెప్పు"

"పంతులమ్మ గారు, ఓ పంతులమ్మ గారు" అంటు దర్వాజా దాటి లోనికి వొచ్చి ఓ ఆనపకాయను మొగరానికి ఆనించి -

"మా పందిరి మీద కాసింది" రైతు కూలీ వెంకన్న

"నీ పేరు ఎంకడు కదా ! చూడు పటేలును అడిగి కొబ్బరి కాయలు కోసుకొచ్చి యిచ్చిపో. రేపు శనివారం కదా" అంటూ కుర్చీలో వొర్గుతున్నప్పుడు ఎంతో వాత్సల్యం లాంటి కదలిక, వెంకన్న" సరేఅన్నట్టు తల వూపుతూ బయటికి నడిచాడు.

"చూశావా ఈ పంతులు గారిని ఎవరూ పస్తులు పండనివ్వరు" బుజం మీది జంధ్యాన్ని చేతులతో జరుపుకుంటు అన్నాడు

"యిదేమన్న కొత్తా" అంటూ సొరకాయతో యింట్లోకి

నడిచింది. "రామచంద్రా" అంటు కుర్చీలో వొరిగి కాసేపు కళ్ళు మూసుకున్నాడు అరవై ఏళ్ళ జీవితాన్ని అద్దంలో చూసుకున్నట్టు గతం కళ్ళ ముందుకొచ్చింది

వెనకట ఏ ఊరి బ్రహ్మలు ఆ వూరిలో పంచాంగాన్ని అనుసరించి తిధి - నక్షత్రాలను చూసి, పెళ్ళిళ్ళు, తద్దినాలు, భూమి పూజలు నిర్ణయించే వాళ్ళు, రోజుకు ఒకటి వచ్చేటట్టు సర్దుబాటు చేసుకోవడం వల్ల తిండి బట్టకు లోటుండేది కాదు. యిండ్లల్లో పెండ్లిండ్లు అయితే ఏది అడిగినా తెచ్చిపెట్టేవాళ్ళు యిప్పుడు పట్టణాలకు పెండ్లి సామాన్లకు వెళ్ళినపుడు అక్కడే లగ్న నిర్ణయం అన్ని లగ్గాలు ఒక్కరోజే ఫంక్షన్ హాళ్లల్లో! ఒకటడిగితే ఒకటుండదు. ఆ పూటే పెళ్ళి, ఆ పూటే విందు మరో గంటకు హాలు ఖాళీ. యిక తద్దినాల మాట దాదాపు మర్చిపోయినట్టే, పోతే భూమి పూజలు మేస్త్రీ ఒక కొబ్బరి కాయ కొట్టేస్తె చాలు ఏం కాలమొచ్చెరా నాయనా ! యింకా ఎలాంటి కాలం రానున్నదో" ! !

* * *

రామయ్య పంతులు భోజనం ముందు కూర్చుంటూ "చూడు మన కష్టాలు గట్టెక్కినట్టే, చిన్నోనికి స్టేట్ ఎక్సైజ్ ఉద్యోగం చిన్నదానికి కమర్షియల్ టాక్స్‌లో ఉద్యోగం తాను ఎం ఏ చేస్తుందట అమ్మాయి ఉత్తరంలో రాసింది" అని ముద్దను నోట్లో పెట్టుకున్నాడు. ఉత్తరంతో పాటు పంపిన ఫోటోనే చూస్తూ కూర్చున్న తల్లి "చాల లావైంది బిడ్డ ఆ పెద్ద

పెద్ద కళ్ళు, పొడవైన జడ, తెల్లని పలువరుస అచ్చం నేను వయస్సులో వున్నప్పుడున్నట్టే వుంది కదండి" అంటు ఫొటోను ముద్దు పెట్టుకుంది

*　　　*　　　*

ఆ తరువాత రామయ్య పంతులు యింటికి పోస్ట్‌మెన్ రాకపోకలు పెరిగాయి ఇంట్లో టివి, బయట లూనా, డెకోలం మంచాలు, వెండి కంచాలు ఊరంతా రామయ్య పంతులుగారి కుటుంబానికి పట్టిన అదృష్టం గురించి చెప్పుకోవడం మొదలు పెట్టారు. యిల్లు కళే మారింది యింతకుముందు ఓ బాప నాయనా అని పిలిచిన వాళ్ళే నాలిక కర్చుకొని "పంతులు గారూ" అని పిలుస్తున్నారు

ఉద్యోగం చేసే అమ్మాయికి పెళ్ళిచూపులొస్తే పెద్దమ్మాయికి పెళ్ళి అవ్వాలంటున్నారు పెద్దమ్మాయి సిటీకెళ్ళి నాలుగేండ్లు కావస్తున్నది ఒక్కసారి కూడ ఆమె యింటికి రాలేదు ఎవ్వరిని సిటికి రమ్మనలేదు అక్కడే కూర్చుని అన్ని నడిపిస్తువుంది

*　　　*　　　*

న గరంలో -

"ఈరోజు మనం డా॥ బి ఆర్ అంబేద్కర్‌గారి జయంతోత్సవం జరుపుకుంటున్నాం ఈ సభకు అద్యక్షత వహించవలసినదిగ మన జిల్లా కలెక్టర్ బి యన్ కె రావు

గారిని కోరుతు వారు అద్యక్షస్థానాన్ని అలంకరించవలసినదిగా మనవి కరతాళధ్వనుల మధ్య కలెక్టర్‌గారు వేదిక నధిష్టించగా, వారి మెడలో పూలమాల

"ఈనాటి ఈ సభకు ముఖ్య అతిధిగా శ్రీమతి కలెక్టర్ గారిని తమ ప్రత్యేక స్థానంపై ఆసీనులు కావలసిందిగ ప్రార్థన" శ్రీమతి కలెక్టరు గారు వేదికను అలంకరించగ ఆమెకు పుష్ప గుచ్ఛాన్ని అందించారు.

మొదట కలెక్టరు గారి తొలిపలుకులు -

"పేదవాడు పైకి రావాలంటే అంబేద్కర్‌ను అనుసరించాలి ఆయనలాగ కష్టపడి చదవాలి చదువు బతుకును మారుస్తుంది ఈరోజు ఈ స్థాయిలో నేనున్నానంటే - దానికి కారణం చదువు! చదవు!! చదువుకొని పైకొచ్చినాక మీ ఊరిని మీరొచ్చిన పేదవాడలను మరిచిపోకండి" కొందరు చప్పట్లు కొట్టారు మరికొందరు ఏదో గుసగుసలు, అది గమనించిన కలెక్టరుగారు ఉపన్యాసం ముగించి కూర్చున్నారు. "తమరు మార్చినట్లే వుంది" జనంలో ఓ గొంతు "యిప్పుడు శ్రీమతి కలెక్టర్‌గారు పేదలకు నూతన వస్త్రాలను పంచిపెడతారు" అంటూ మరో అధికారి లిస్ట్ చదువుతువున్నాడు

బట్టలు తీసుకోవడానికి తీసుకురాబడిన కుంటి, గుడ్డి, ముదుసలి వాళ్ళంతా ఆ పట్టణానికి చెందిన వాళ్ళే, అధికారి పేర్లు చదువుతుండగ ఒక్కొక్కరే వచ్చి ఆడవాళ్ళు చీరెలను మొగవాళ్ళు దోతులను తీసుకున్నారు.

ఆ తరువాత "యిప్పుడు శ్రీమతి కలెక్టర్‌గారు తమ సందేశమిస్తారు"అని ప్రకటించాడు అధికారి

జనంగోల ఎక్కువైంది, ఎవరూ దేనిని వినిపించుకున్నట్టు లేదు.

"మన కలెక్టర్‌గారు చదువు బ్రతుకును మార్చేస్తుంది అన్నాడు అది నిజం, వారి స్వాఅనుభవం కూడ, వారు అంబేద్కర్‌లాగ ఎన్నో అవమానాలకు గురి అయ్యారు పట్టుదలతో చదివి పేదరికాన్ని వదిలించుకున్నారు ఆయన అంబేద్కర్‌కు అక్షరాల వారసుడు. ఒక్కరిద్దరు బాగుపడగానే పేదరికం పోయిందనలేము. అంతేకాదు ఎవ్వరు కూర్చొని తినకూడదు".

"కూర్చొని తినేది ఎవరంటా" జనంలో నుండి ఓ కేక "అదే ఆలోచించవలసి వుంది అలాంటి వాళ్ళకు శ్రమించడం నేర్పవలసి వుంది అందుకోసం అందరం కృషి చేస్తేనే ఈ మార్పు జరుగుతుంది జై భీమ్" అంటు సభకు నమస్కరిస్తూ కూర్చుంది.

ఆ తరువాత జనగణమన-

కలెక్టర్ కారు వైపు నడిచాడు వెనకాల అమ్మగారు "అలంకరించిన బ్యూటీ పార్లర్ చెప్పుకోదగ్గదే! ఆ విగ్రహానికి తగ్గట్టు ఆమె వేషధారణ" అంటు వెనకనే నడుస్తున్న మరొకడు "కాదు" అంటు గుంపులో నుండి ఓ అజ్ఞాత గొంతు

యిద్దరు కారులో కూర్చోగానే కారు కదిలి రోడ్డెక్కింది

విన్నారుకదా సూటిపోటి మాటలు" అంటూ కలెక్టర్ ముఖంలోకి చూసింది మానస

"కొత్తేం కాదు కదా"

"వీళ్ళెన్నడు బాగుపడుతారో" మానస

"అందరు చదువుకున్ననాడు"

" ఏం చదువో ఏంటో కాని నేను కలెక్టర్ భార్యను కానట"

"విని ఊరుకున్నారే"

మౌనంగా మానస వైపు చూశాడు అపపడు ఆమె ముఖం ఎరుపెక్కి అవమానంతో అతలాంకుతలాంగ కనిపించింది

కాసేపు మౌనం తరువాత ఓ బరువైన శ్వాస వదిలి కర్చీఫ్‌తో నుదురును అద్దుకుంది

"ఒకసారి సొంత విషయాన్ని మరొకరు నలుగురిలో నవ్వులాటగా మాట్లాడొద్దన్న విషయం వీళ్ళెంకెప్పుడు తెలుసుకుంటారో"

"మనం చెప్పగా చెప్పగా"

"మరి కాలేజీల్లో ఏమి నేర్చుకుంటునట్టు"

"రొట్టె, బట్ట ఎలా సంపాదించుకోవాలనే విషయం"

వీళ్ళ సంభాషణ వింటూ డ్రైవర్ కారు నెమ్మదిగా నడుపుతున్నాడు

"మీరు వాళ్ళనే సపోర్టు చేస్తున్నట్టు వుంది" అంటూ కలెక్టర్ కళ్ళలోకి చూసింది అప్పుడామె కళ్ళలో నిష్టూరం కదిలికలో జాణతనం కనిపించగానే రావు గారి చూపులు

మానస మీద ఆగాయి.

కారు కలెక్టర్ బంగళాముందు ఆపి డ్రైవర్ డోరు తెరవగానే దిగి యింట్లోకి నడిచారు, పనివాళ్ళు బయటికి నడిచారు అప్పటి వరకు లైట్స్ మాత్రమే వెలుగుతున్న యింట్లో ఫ్యాన్లు కూడ తిరగసాగాయి. గదిలో నిలువుటద్దం ముందు నిలుచోని రావుగారు కోటు బటన్ తీయగానే, వెనకనుండి వచ్చిన మానస కోటు నందుకొని హాంగర్‌కు వేసి, ముందు కొచ్చి నిలుచోని టై ముడి విప్పసాగింది అప్పుడు రావుగారు రెప్పవాల్చకుండ అద్దంవైపే చూస్తున్నాడు "ఏమిటలా చూస్తున్నారు" అంటూ షర్ట్ బటన్స్ విప్పుతూ ఆఫీసు గదిలో టెలిఫోన్ మోగింది, రావుగారు ఫోన్ వైపు నడిచారు. మానస అల్మారా వైపు నడిచి నైటీని తీసుకుంది.

★ ★ ★

తిరుమలేశునికి దర్శనానికి వేలమంది క్యూలో నిలుచున్నారు. అధికారులెదురొచ్చి రామయ్య పంతులును, సీతమ్మను ప్రత్యేక మార్గం గుండా గర్భగుడిలోకి తీసుకెళ్ళి దర్శనంగావించి శేషవస్త్రాలు బహూకరించి, తీర్థప్రసాదాలను యిప్పించి, ఓ కాటేజిలో బస ఏర్పాటు చేశారు.

"యిది కలా నిజమా!"

"కొంచమాగండి" అంటూ భర్తను సమీపించి అతని భుజాన్ని గిల్లింది

"వుండవే నిజమేను" అంటూ గిచ్చిన చోట చేత్తో రుద్దుకుంటు తమను దిగబెట్టి కదిలిపోయె కారువైపు చూస్తు నిలుచున్నాడు

"ఇది ఎవరి పని అంటారు చిన్నోడు చేయించాచ్చా, లేక చిన్నదా?

"పెద్దదాని పనే, ఎం ఏ సంస్కృతం పాసైంది కదా యిక్కడే దేవస్థానంలో ఏదో పెద్ద వుద్యోగం దొరికిందేమో!" అంటు అప్పుడే వచ్చిన దేవస్థానం ఉద్యోగి వైపు మళ్ళి -

"నాయనా ఈ దేవస్థానం అధికారి ఎవరు" అంటు జంధ్యాన్ని ఓ సారి బయటికి లాగి మళ్ళీ లోపలికి నెట్టుతూ అడిగాడు ట్రేలోని పాల గ్లాసులను టేబుల్ మీదుంచుతు ఎందుకు అన్నట్టు చూశాడు

"ఆఁ ఏ కులంవాడు అని" జంకుతునే అడిగాడు

"యస్ సి"

"అలాగ" అంటు విస్తుబోతుండగ

"ఏం- ఎస్సీ వుండకూడదా"? చూపుల్లో ఓ మాదిరి కసిని కలబోస్తూ అడిగాడు.

"ఆఁ దానికేం యిప్పుడు వాళ్ళుకూడ అర్చకులుగా వున్నారు కదా"

"తమరెవరండి"

"ఎవరైతే ఏముంది, బ్రహ్మంగారుఅన్నట్టువర్ణసంకరణ జరిగి పోతూనే వుంది "నీ వెవరు నాయనా"

"నేను యస్సీనే" అంటు వెళ్ళిపోయాడు

"ఏమండి ఆ పాలను పారపోయండి"

రెండు గ్లాసులను తీసికెళ్ళి వాష్ బేసిన్లో పోస్తూ "కృష్ణార్పణం" అన్నాడు

"అవి అంటుబడ్డ పాలు, కృష్ణార్పణం అంటున్నారేమిటి?"

"పాపం క్షమించుగాక, సర్వార్పితం" అన్నాడు చెంపలు వేసుకుంటు

మరునాడు ఉదయం దేవస్థాన ఉన్నత ఉద్యోగి వొచ్చి - "తమరు రామయ్య గారే కధా?"

"చిత్తం" అంటూ చేతులు జోడించి నిలుచున్నాడు

"యిదిగో మీ ఊరి దేవాలయానికి మూడు లక్షల రూపాయలను దేవస్థానం వారు మంజూరి చేశారు మీరు మీ ఊరెళ్ళి ఓ కమిటీని వేసి ఆ కమిటి ద్వారా ఈ గ్రాంటును ఖర్చు చేయించండి". అన్నాడు ఆ ఉద్యోగి

ఏమిటో అర్థంకాని చూపులతో వినయంగా ఆ కాగితాన్ని అందుకున్నాడు

"పోతే మీ దంపతులకు నూతన వస్త్రాలు", అంటు రెండు అట్టపెట్టెలను అందించాడు ఈ సారి నోరు తెరచి కళ్ళప్పగించి చూస్తు "అమ్మా ఇదంతా ఎవరి దయ"అని అడిగాడు

"అంతా వెంకన్న దయ, యిక మాకు శెలవు యిప్పించండి, కారు సిద్ధంగా వుంది వెళ్ళిరండి, ఉంటాం" అంటూ వెళ్ళిపోయాడు.

దంపతులు గుడివైపు చేతులు జోడించి కాసేపు నిలుచోని ఆ తరువాత కారులో కూర్చున్నారు.

కారు కదిలింది.

★ ★ ★

అది మరో ఊరు వచ్చేపోయే బస్సులు, ఆగే చావడి అది. ఆ పక్కనే వున్న పేటకు వెళ్లడానికి నలుగురైదుగురు నిలుచున్నారు. వాళ్ళల్లో ఊరి మోతుబరి రైతు చంద్రారెడ్డి, పెద్ద గౌడ్ బాలయ్య, ఊళ్ళోని హరిజన వాడ వైపు నుండి వస్తున్న జీపును ఆపాలని చేయి ఊపాడు చంద్రారెడ్డి. అది ఆగకుండా దుమ్ము లేపుతూ వెళ్ళిపోయింది

"ఎక్కడిదీ జీపు" రెడ్డి

"చదువు వెలుగని రాసి వుంది" గౌడ్

"అట్టనా హరిజనవాడ నుండి వస్తుంటే మన నాగయ్య కొడుకు పోతుండేమో అనుకున్న" రెడ్డి

"ఎవరు కొండయ్య, ఆయనెందుకొస్తడు, రాక ఎన్నేండ్లాయె"

"ఆయన కలెక్టరైండని ఎంత మురిసినం, ఈ ఊరును బాగుచేస్తాడని తల్లితండ్రులను సుఖపెడతాడని" రెడ్డి

"ఊరు బాగు సేయకుంటమాయె తల్లి తండ్రులకు కష్టం తప్పదాయె యింకా కూలి బతుకే! అదేపూరిల్లు, తాటాకుల పందిరి!!

అవును మొదట ఏమిలేనపుడు మేన పిల్లను చేసుకునే యిన్నో అన్నో యిస్తే ఆటిని ఖర్చుపెట్టే నౌకరి సంపాయించె.

యిప్పుడేమో దానికి చదువురాదు, నల్లగుంది మోటుముండ. అంటున్నాడట

"స్వంత చెల్లె పిల్లలతో పాటుపోతే మాట్లాడనేలేదట, ఓ సారి అన్నపోతే బర్లను యిప్పిస్తే అమ్ముకుంటివి, కోళ్ళనిప్పిస్తే చావగొడితివి. ఏంచేసి బతుకుతవు అన్నాడట, తమ్ముణ్నేమో కాలేజీలో చేర్పించి హాస్టల్లో వుండమన్నాడట" రెడ్డి

"యింకా ఈ సంగతి తెలవదేమో. తల్లి తండ్రి వెళ్ళి కోడలిని నీ వెంట వుంచుకొని, మా కింత పంపితే పూట గడుసుద్దని అంటే అసలు మీరెందుకొచ్చిండ్రని ఆ రాత్రి ఎక్కన్నో వుంచి మరునాడు పంపిచ్చిండట" అప్పటి వరకు వాళ్ళ సంబాషణ వింటున్న మరో పెద్ద మనిషి.

"నాగయ్య కొడుకు సంగతా మాట్లాడేది" దారంతో కట్టిన కళ్ళద్దాలనుండి చూస్తూ అడిగాడు.

అవునన్నటు ఇద్దరు తలాడించారు.

"పేరు గూడ మార్చుకుండట, మొన్న మామను పిలిపించి ఎ బిడ్డకు విడాకులివ్వాలి అనుకుంటున్న ఎంత కావాలి అన్నాడట. భోరున ఏడుస్తూ వద్దు తండ్రీ, సచ్చినా బతికినా నీ దగ్గరే పడివుంటది. ముద్ద పెట్టు చాలు అంటు కాళ్ళు పట్టుకున్నా కాదంటే కాదన్నాడట" పెద్ద మనిషి.

"కుటుంబమంతా కూలిచేసి పండగలు మాని పస్తులుండి సదివిస్తే ఆఫీసర్ అయినంక ఆడు చేసే పనియిదా?" రెడ్డి

"నీకు యింత పెద్ద నౌకరొచ్చింది యిగ మా పేదరికం

పోతుందనుకున్నం అని అంటె-
ఒక్కసారే ఎవ్వరి పేదరికం పోదన్నాడట"
"నా బిడ్డను కాదని మరొకరితో సంసారం చేయడం అన్యాయం, అంటే - నీ బిడ్డకు డబ్బు పంపుతునే వున్న కదా, ఏ మాత్రం గోల చేసినా అదీ బందు అవుద్ది" అని పంపించిండట

★ ★ ★

"ఎక్కువ చదివించడం నాదే బుద్ధి తక్కువ"
"మీరేమకుంటున్నారు"
"మరి నీవు చేసిన పనేమిటి"
"మరో మార్గం కనిపించలేదు"
"అంటే"-
"మన పస్తులు పోవాలి, తమ్మునికి చెల్లెకు ఉద్యోగం రావాలి"
"ఉద్యోగమే వచ్చింది చూశావు కాని యిపుడు దాన్ని ఎవరు చేసుకుంటరు"
"మరో ఆఫీసర్"
"ఆఫీసర్‌కు ఎంతకట్నం కావాలనుకుంటున్నవ్"
"నేను చూసుకుంటాను కదా"
"అంటె దాన్ని నీలాగే"
"కాదు తగిన వరుణ్ణి చూసి పెళ్ళి చేస్తాను"
"చేస్తావు, చేస్తావు, యస్సీ కలెక్టర్ బంధువులుగా వీళ్ళు యస్సీలని సర్టిఫికెట్ కూడ తీస్తావు"

ఈ సంభాషణ జరిగినంతసేపు వొకరి ముఖం ఒకరు చూసుకోకుండ వెనుతిరిగి నిలుచున్నారు.

"మన ఆర్థిక నేపథ్యం గురించి కూడ ఆలోచించవల్సి వుంది"

"అయితే ముందు మా చావు చేయించు"

"నాన్నా-" ఒకేసారి ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు కలెక్టర్ బంగళాముందు లాన్స్‌లో ఈ సంబాషణ

"లోనికి పదండి-" అంటు అనుకోకుండ తన్నుకొచ్చిన కన్నీరును తుడుచుకుంటు తండ్రి చేతులు పట్టుకుంది. రామయ్య మౌనంగా కదలకుండా నాటిన విగ్రహంలా నిలుచున్నాడు ముక్కు పుటలు రోషంగా కదులుతున్నాయి నుదుటి విభూది తడిసిపోతుంది

"కాలాన్ని బట్టి పట్టు విడుపులుండాలి నాన్న"

"నా కడుపున పుట్టి నాకు పాఠాలు నేర్పుతున్నావు" కోపంతో పెదాలు వొనుకుతున్నాయి

"అంతమాట అనకునాన్నా. మనస్సు మార్చుకుంటే బాగుంటది అంటున్న"

'వేదపారాయణుడు, నిష్టాగరిష్ఠుడైన ఈ రామయ్య పంతులు రేపు చండాలునికి పుట్టే సంతానాన్ని తన ఎదమీద ఎత్తుకొని తిరగాలి, వేలుబట్టి నడక నేర్పాలి, అంతేకదా" అన్నపుడు ఆయన కళ్ళు మరి ఎరుపెక్కాయి

"మరో జన్మ అంటూవుంటే కడజాతిలోనే జన్మిస్తాను అన్న

మహాత్ముని మాటలు మీరు చదవలేదా”

“అవన్నీ రాజకీయ ఉపన్యాసాలు. వశిష్ఠ వంశానికి చెందిన ఈ సీతారామయ్య పంచములతో బతుకు పంచుకోవడమా!”

“మరి వశిష్ఠుడు - అరుంధతీ సంబంధం”

“అవి కట్టు కథలు”

“భారతం కట్టు కథేనా”

“సంస్కృతం చదవడం వల్ల నీకు తెలివి ఎక్కువైంది”

“మీరే అనేది కదా నాన్న, మానస నన్ను మించిన పండితురాలు అవుతుందనిని, చిన్నపుడు నా తర్కం విని”

“అదే యిప్పుడు నా కొంపకు చేటు తెచ్చింది”

“యింతకి అమ్మ బాగుందా నాన్నా”

“ఏడుస్తుంది, ఈ కులం కాని కూడుకన్న, వస్తులే మేలంటుంది ఊరుకోడై కూస్తుంటే ఎలా తలెత్తుకు తిరగాలి”

యిద్దరి మధ్య కొన్ని క్షణాలు మౌనం.

“ప్రస్తుతానికి ఊరొదిలి అమ్మ చెల్లె దగ్గర, మీరు తమ్ముని దగ్గర ఉండుండి. మిగతా విషయాలు తరువాత ఆలోచిద్దాం”.

“ఆలోచించింది చాలు” అంటు వెనుదిరిగి గేటువైపు నడుస్తు జారిన భుజంమీది జరీ అంచు శాలువను సరి చేసుకున్నాడు.

“నాన్నగారు, నాన్నగారు”

తిరిగి చూడలేదు, ఆగి మాట్లాడలేదు

లాన్స్‌లో నీళ్ళు పట్టిస్తున్న మాలి వెళ్ళి ఆపుదామని అనుకున్నాడు. ఎందుకో ఆపలేకపోయాడు. పెండ్లికాని పిల్ల పెండ్లి అయిన వాడితో తిరుగుతుంటే యిన్నాళ్ళు ఏంచేసిండో? అని తనలోతాను అనుకున్నాడు కనపడకుండా పోయేంతవరకు తండ్రి వైపే చూస్తున్న మానస చూపులు ఎదురుగ వున్న పూల చెట్ల మీద ఆగినయి.

మొన్నటి వరకు చెట్లనిండా కనిపించిన పూలు ఈ రోజు లేవు! తనలో కలిగిన సంచలనాన్ని అణుచుకోడానికి మానస లాన్స్‌నుండి గేటువైపు నడుస్తువుంది గేటు దగ్గర గ్రామీణులిద్దరు కలెక్టరు గారి కోసమని నిలుచున్నట్టుంది. మానస గేటును సమీపించి మూసివున్న గేటు మీద చేతులుంచి, వాళ్ళను పరిశీలనగా చూడ సాగింది.

ఆ దుమ్ము బారిన పాదాలు ఏఏ కోరికలను గమ్యాన్ని చేర్చాలని మెసుకొస్తున్నాయో! ఆ బిక్కు బిక్కుమనే చూపులు ఏ ఆశల్ని దాచుకొస్తున్నాయో! కలెక్టర్ గారుంటే బాగుండు.

అరవై ఏండ్ల పల్లెవాసి, బుర్రమీసాలు, తలపాగ, చెవికి వేలాడుతున్న పోగు, సరిగ్గా ఆయన వయస్సులో సగం వున్న స్త్రీ మెడల పసుపుతాడు, చేతులకు మామూలు గాజులు, రంగువెలసిన నూలుచీర. ముఖాన పైసంత కుంకుమ బొట్టు, తెల్లని పలువరుస, ఎండవానల్లో రంగుమారిన ఓ మాదిరి శరీర ఛాయ.

"ఏం కావాలి"

"కలెక్టరయ్య గార్ని కలవాలి"

"దరఖాస్తు ఏమన్నా తెచ్చారా, దొర వూర్లో లేరు"

"ఎప్పుడొస్తాడు"

"రెండు రోజుల తరువాత"

"తమరు"

"యిక్కడే పని చేస్తుంటాను, చెప్పండి"

అయితే యిది అది కాదన్నమాట అనుకుంటూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు

"ఏమీ లేదు ఒక మాట అడుగుదామని వచ్చినం నేను ఆయన మేనమామను,

ఆమాట విన్న మానస మనస్సు కలుక్కుమంది

బహుశ ఈవిడే ఆమె అయివుంటుంది విన్న పోలికలు కలుస్తున్నాయి

"లోపలికి రండి మాట్లాడుదాం"

"లోపలికి వస్తే ఏముంది - అసలోల్లు లేంది-"

"నా సమితి కనబడితే జుట్టు బట్టి కొట్టిపోదు" అంటూ కోపంతో ఊగింది

ఈ సారి మానసకు ఒళ్ళు జల్లుమంది ఆయన లేందే మంచిదైంది అనుకుంది

"ఆమె కూడ ఎమ్మటే పోద్దా అమ్మా" అని అడిగాడు

"ఉంచుకున్నదే ఊరేగేటందుకాయె!" కళ్ళలో కసి, మాట పలకడంలో ఏవగింపు కొట్టొచ్చినట్టు కనిపించాయి.
మానస మౌనంగా చూస్తూ నిలుచుంది ఎడమ చేతికి కాల చక్రం, కుడి చేతికి బంగారు గాజులు, ఎదలో ఏముందో కనపడకుండ మెడనిండా కప్పుకున్న కొంగు!

ఆ తరువాత వాళ్ళు రోడ్డువైపు, మానస బంగ్లాలోకి నడిచారు
బి యన్ కే రావు IAS గేటు పిల్లరుకు వేలాడుతున్నాడు

తరతరాల తర్వాత వొచ్చిన అవకాశం అందవల్సిన వాళ్లకు అందకుండా పోతుంది, చెందవల్సిన వాళ్లకు చెందకుండా పోతుంది" అనుకుంటూ, వూలి, ఎండుటాకులను ఏరుతువున్నాడు

జూన్ 1993

# ఊరేగింపు

ప ట్టణపు చౌరస్తాలో అంబేద్కర్ విగ్రహం మెడలో ఎన్నికల్లో నిలుచోబోయె అభ్యర్థి పూలదండ వేయగానే చుట్టు నిలుచున్న వాళ్లు చప్పట్లు కొట్టారు

"డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్"

"అమర్ హై" అంటూ జోహార్లు పలికారు

"పేదలంతా" కార్యకర్త

"ఒక్కటై" గుంపు

"ఉన్నవాని అధికారం సాగనివ్వం" కార్యకర్త

"సాగదు యిక సాగదు" గుంపు

పోటి చేస్తున్న అభ్యర్థి ముందు నడువగ డప్పు కొమ్ములతో

ఊరేగింపు మెయిన్ రోడ్ గుండా వెడుతువుంది.

దుకాణాదార్లు బయటికి వొచ్చి ఊరేగింపును చూస్తు నినాదాలు వింటున్నారు బజారులో జనం గుంపులు, గుంపులు గుసగుసలు

"వరసగా మూడుసార్లు గెలిచిన పార్టీ ఈ వూరికి ఏం చేయలేకపోయింది ఆ పార్టీ కాదని ప్రాంతీయ పార్టీ అభ్యర్థిని గెలిపిస్తే ఆయనే ముఖ్యమంత్రి అయ్యీ కూడ ఏం చెయ్యలేక పాయే. ఈసారి కొత్త మనిషి, కొత్త పార్టీ", "చూద్దాం" అంటూ ఒకరితో మరొకరి మాటలు

ఈలోగా ఊరేగింపు రెవిన్యూ ఆఫీసు చేరింది డప్పులు, కొమ్ములు ఆపేసి నినాదాలు ఇస్తు పక్కనే వున్న చెట్ల కిందికి చేరాక అభ్యర్థి మరో నలుగురితో కలిసి ఆఫీసర్ గది వైపు నడిచారు

అప్పటికే అధికార పార్టీ అభ్యర్థి రంగారెడ్డి, బ్యాండు మేళంతో వచ్చి నామినేషన్ వేసి ఆఫీసు ఎదురుగా వున్న వేప చెట్టు క్రింద తన పార్టీ కార్యకర్తలతో నిలుచోని పరిస్థితిని పరిశీలిస్తున్నారు

అంతకు ముందే మొదట మిత్రపక్షాల తరపున దేవశర్మ నామినేషన్ వేసి వెళ్లారట

మళ్లీ నినాదాల శబ్దం

అభ్యర్థి లోపలికి వెళ్లి తన నామినేషన్ పత్రాన్ని రిటర్నింగ్ అధికారికి అందజేసి, పత్రికల వారి కెమెరాల వైపు నవ్వుతూ

చూశాడు

"సత్యాజీ గారు మీరేనన్న మాట" అంటు అభ్యర్ధి వైపు చూస్తూ ఎన్నికల అధికారి నామినేషన్ పత్రాన్ని అందుకున్నాడు

అవును అన్నట్లు తలవూపి చిన్నగా నవ్వాడు సత్యాజీ.

"మీ పార్టీ గురించి పత్రికల్లో చూస్తూనే వున్నాం" అధికారి

"ఈసారి అధికారం మా పార్టీ చేతుల్లోకి రానున్నది" నవ్వు ముఖంతోనే కుర్చీలోంచి లేస్తు అన్నాడు

"ఇది ప్రజాస్వామ్యం" అంటూ కాస్తా కదిలి కూర్చున్నాడు అధికారి

బయట నినాదాలు

"సాధిస్తాం. సాధిస్తాం" కార్యకర్త

"రాజ్యాధికారం సాధిస్తాం" గుంపు

"ఓట్లు మావి" కార్యకర్త ,

"సీట్లు మావే" గుంపు

కార్యాలయంలో పని చేసే వాల్లందరూ ఒక్కసారే బయటికొచ్చి అభ్యర్ధులను చూస్తు నిలుచున్నారు

ఆ నినాదాలు అక్కడే నిలుచున్న రాంరెడ్డిలో కాస్తా ఆందోళన లేపాయి.

"అవును ముందెన్నడు లేని ఈ కొత్త పార్టీ, అన్ని కులాల వాళ్లు, ముఖ్యంగా మైనార్టీలైన క్రిస్టియన్లు, ముస్లింలు ఈ పార్టీలోనే వున్నారు వాస్తవంగా ఓట్లన్నీ వాల్ల చేతుల్లోనే, ఏం జరుగుతుందో" అన్నాడు రెడ్డి

"ఏం జరుగదు, అధికార పార్టీని ఓడించడమంటే మాటలా ఏంటీ ?" అన్నాడు ఓ కార్యకర్త

"చెప్పలేం" మరో కార్యకర్త

"ఈసారి పరిస్థితి వేరు!" రాంరెడ్డి

★ ★ ★

అది కొత్తగా కట్టిన బవంతి, చుట్టు ప్రహరీ గోడ కారు వెళ్లేంత గేటు లోపల ఏపుగా పెరిగిన టేకు చెట్లు వున్నాయి

ఉదయం పూట సత్యాజీ ఇంట్లోనే వుండొచ్చు, అనుకుంటు కాలింగ్ బెల్ నొక్కాను పక్షి అరిచినట్టు శబ్దం.

ఆపీసు గదిలో నుండి బయటికి వొస్తు నన్ను చూసి సత్యాజి

"రండి, రండి" అంటూ ఎదురొచ్చి లోపలికి తీసుకెళ్లాడు

"రాజకీయాల్లో దిగినట్టుంది" అంటూ సత్యాజీ సైగతో చూపిన కుర్చీలో కూర్చొంటు అన్నాను

"దిగకూడదా?" అంటూ ఎదురు కుర్చీలో కూర్చున్నాడు

"అబ్బె దిగకూడదని కాదు, కానీ వ్యాపారం"

"రెండింటిని నడిపిస్తాం"

"మీరు రాజకీయాలకు కొత్త, మీ పార్టీ ఎన్నికల్లో కొత్త"

"ఏదైనా మొదట కొత్తే కదా ?" అంటు అప్పటి వరకు టీపాయ్ మీదున్న పెన్నును జేబుకు పెట్టుకుంటు అన్నాడు

"కాస్త కష్టమే" అంటు తన చేతిలోని ఓపక్ష పత్రికను టీపాయ్ మీదుంచాను

పత్రిక ముఖ చిత్రం మీదికి దృష్టిని మరలుచుతూ

"మీరు తెచ్చిన పత్రిక మీద మా నాయకుని బొమ్మ! ప్రముఖ పత్రిక ముఖ పత్రంగా వేస్తున్నారంటే మీకు అర్ధమయ్యే వుంటుంది మా నాయకుని గూర్చి చెల్లాచెదురుగ వున్న మనలను ఒక్క తాటి మీదికి తెచ్చాడు" అంటూ సూటిగ నా ముఖంలోకి చూస్తు కనుబొమ్మలను కదిలించాడు

"ఈ పార్టీ మీద నాకు నమ్మకం లేదు"

"గెలిచి తీరుతాం అని పార్టీ ప్రకటించింది" చెపుతున్నప్పుడు వొచ్చిన చిన్న ఆవలింతకు చేయి అడ్డం పెట్టుకున్నాడు

"ఎన్నికల్లో పోటి చేసే ప్రతి పార్టీ గెలుస్తాం అనే అంటారు" అన్నాను సత్యాజీ నా వైపు అదో మాదిరిగ చూసాడు

"మరోలా బావించొద్దు, నాకు తెలిసింది నేను మాట్లాడుతున్న" సూటిగ ఆయన ముఖంలోకి చూస్తు అన్నాను.

"తన మన తెలియకుండానే పోటి చేస్తామా ?"

"లెక్క పెట్టే రోజు పెట్టె తెరిస్తే తెలుస్తుంది"

"అది గతంలో" పత్రికపై వున్న తమ నాయకుని బొమ్మను రెప్పవాల్చకుండా చూస్తు అన్నాడు

"యిప్పుడు మీ పార్టీ ప్రత్యేకత ఏమిటో"

"అందరం ఒక్కటైనాం, ఓట్లు మన చేతుల్లో వున్నాయి మనమే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాం." కుడి చేతిని పిడికిలి బిగించి బల్లపై ఆనిస్తు అన్నాడు

"గతంలో ఓట్లు మన చేతుల్లో లేవా ?"

"ఉండే కానీ అప్పుడు మనకో జాతీయ స్థాయి పార్టీ లేదు, జాతీయ నాయకుడు కూడా లేడు"

"లేబర్ పార్టీ, ఆ తరువాత రిపబ్లికన్ పార్టీ ఏ స్థాయివి? వాటి వ్యవస్థాపకుడు డా|| అంబేద్కర్ జాతీయ నాయకుడు కాడా ?"

సత్యాజీ మాట్లాడకుండా ఆలోచనల్లోకి వెళ్ళాడు

"అసలు మన జనం సంగతి మీకు సరిగా తెలియదు, ఆయన్నే ఆరోజుల్లో గెలిపించలేక పోయారు"

"అప్పుడు వాళ్లకు ఓటు విలువ తెలియక అమ్ముడు పోయే వాళ్ళు"

"ఇప్పుడు మాత్రం . "

"అలా జరగదు. ఓటు విలువ తెలుసుకున్నారు"

"లేదు బ్రదర్ ఇన్నాళ్ల కాలం కాదు, మీరు ఇప్పుడు గ్రామాల్లోకి వెళ్లి చూడండి, చాకిరీ కులాలన్నీ ఏకమైనాయి, మేం ఏ వూరు వెళ్లినా డప్పులు, కొమ్ములతో ఎదురుకోళ్ళు, కూలి మాని ఆ రోజంతా సమావేశమై ఎలాగైనా రాజ్యాధికారాన్ని రాబట్టు కోవాలే

స్వాతంత్ర్యం వొచ్చి ఇన్నాళ్ళైంది మన బతుకుల్లో మార్పు రాలేదు

ఓ వూర్లో వేయి వోట్లు అందరివైతే అందులో యాబది ఓట్లువున్న రెడ్డి గారు గెలుస్తాడు. మరికొన్ని ఊళ్లల్లో పది ఓట్లున్న వెలమ లేదా కమ్మ గెలుస్తాడు. ఇంకా చెప్పాలంటే

ఒకే ఒక ఇల్లున్న వెనకటి కరణం సర్పంచ్! యిలా వుండడానికి వీలు లేదు. వందల ఓట్లున్న మనం అంటే బహుజనుల్లో నుండే సర్‌పంచ్ కావాలే, అట్లనే వేల ఓట్లున్న వాళ్లల్లో నుండే ఎం.ఎల్.ఏ. కావాలే, అట్లనే లక్షల ఓట్లున్న వర్గం వాడే ఎం.పి. కావాలే.. ..

అంతట వీళ్ళే అయ్యి ఢిల్లీ గద్దెను ఎక్కి రాజ్యపాలన జరపాలని పట్టుబడుతున్నారు. చేయి, చేయి, కలిపి నడుస్తున్నారు. మమ్ములను ముందు నడిపిస్తున్నారు. అందువల్ల ఈసారి మన పార్టీదే గెలుపు. మీరు కూడా మా వెనక వుండి బహిరంగ సభల్లో మీ కవితల ద్వారా జనాన్ని ఏకం చేసి గెలిచేటట్టు చూడాలి" అంటు ఓ మాదిరి ఉద్రేకపు ఉపన్యాసాన్ని యిచ్చాడు.

"మన వాళ్లు యిప్పట్లో ఏకం కారు"

"మీరు చూస్తు వుండండి.

మా పరుగును మేం కొనసాగిస్తాం" అంటూ లేచాడు సత్యాజీ.

"కవితలు అన్నందుకు గుర్తొచ్చింది....

"కవితలు విని పిడికిళ్లు బిగిస్తారు.!

ఉపన్యాసాలు విని చప్పట్లు కొడతారు!

ఎన్నికలు వచ్చాయంటే

అటో యిటో ఎటో !

గెలిచిన వాడి వూరేగింపులో ఎగిరి గంతులేస్తారు".

★ ★ ★

పోలింగ్‌కు మూడు రోజుల ముందు ప్రచారాన్ని ఆపివేసింది ప్రభుత్వం. అభ్యర్థుల ఇళ్ల నుండి ఊసిల్లలాగ లేసిన నోట్లు కార్యకర్తల చేతుల్లోవాలి అక్కడ పోల్ చీటీలను కరుచుకొని ఓటర్ల ఇళ్లల్లోకి దూరాయి.

ఆరోజు పోలింగ్ టౌన్ అంతా హాల్‌చల్‌గా వుంది. అభ్యర్థులు ప్రతిబూతును దర్శిస్తూ ఓటర్లను చిరు నవ్వుతో మందిలిస్తు తిరుగుతున్నారు

జనం పోలింగ్ బూతుల వద్ద క్యూలల్లో నిలుచున్నారు. చురుకుగా పోలింగ్ జరుగుతు వుంది.

రాంరెడ్డి గారు, శర్మగారు, సత్యాజీ ఎవరికి వారే తమ, తమ కార్యకర్తలు తెచ్చే వార్తలకు తృప్తిగ శ్వాస పీలుస్తున్నారు. మధ్య మధ్యన స్వయంగా పోలింగ్ బూతులను దర్శిస్తు భరోసాను భర్తీ చేసుకుంటున్నారు. పూర్తి పేర్లతోటి, పాత వరసలతోటి ఓటర్లను పలకరిస్తున్నారు.

ఆరోజు సత్యాజీ గారింట్లో ఎన్నికల గూర్చి, ఆయన పోటిలో నిల్చోవడం గూర్చి మాట్లాడినందుకు ఏమనుకున్నాడో ఏమో, ఎపుడైనా ఎదురైతే ముఖం తిప్పుకుంటున్నాడు.

నేను ఓటువేయడానికి వెలుతూ వుంటే మధ్యలో సత్యాజీ కారు నడుపుకుంటు ఎదురొస్తు, రిక్షా అడ్డం రాగానే ఆపుకుని హారన్ ఇస్తువున్నాడు.

సరిగ్గా అప్పుడు ఆయన కారు డోరు ఎదురుగా నేను

నిలుచున్నాను పక్కనున్న వ్యక్తితో సీరియస్‌గా మాట్లాడుతు నన్ను చూసీ చూడకుండానే వెళ్లిపోయాడు అప్పుడు ఆయన కారు టైరులో గాలి ఎక్కువగ వున్నట్టువుంది కాస్త స్పీడుకే ఎగిరి ఎగిరి పడుతువుంది.

సత్యాజీ తన ముఖంలో గెలుపు కళను తెచ్చి పెట్టుకుని నిండుగా నవుతువున్నాడు.

కొంత దూరం నడిచి సందు తిరిగానో లేదో స్కూటర్ మీద సత్యాజీ కార్యకర్త ఎదురై నన్ను చూసి "సర్ సత్యాజీ కారు యిటు వెళ్లిందా" బండిని బ్రేక్ చేస్తు అడిగాడు, అతని స్కూటర్‌కు జండా లేదు, వొట్టి కర్ర మాత్రమే వుంది మనిషి వొగరుస్తు వున్నాడు

"ఏంటి సంగతి" అడిగాను.

"రెండో నెంబర్ బూతు దగ్గర, రాంరెడ్డి మనుషులు మన వాళ్లను కొట్టారు".

"బయటి వాళ్లా"

"కాదు యిక్కడి వాళ్లే, బాహర్‌పేట బాంద్, చాకలి పెంటయ్య, సురిగి మారయ్యను తల పగలకొట్టారు, సుక్కరాములు చేయి విరిగింది, దవాఖానకు పంపించి ఈ సంగతి చెప్పడానికి నేను వొస్తున్న

"ఇప్పుడే ఇటు వెళ్లాడు బహుశ ఇక్కడున్నది పదో బూతు కదా అక్కడ దొరకొచ్చు" అన్నాను

"వస్త" అంటు గేరు మార్చాడు

"కొట్టింది మనవాళ్లే, దెబ్బలు పడ్డది మనవాళ్లే, ఏది ఏమైనా యింకా ఎక్కువ పెరగకుండ చూడండి" అన్నాను

బండి కదిలింది నా తల నిండా ఆలోచనలు

★ ★ ★

టౌన్ హాల్లో ఓట్ల లెక్కింపు జరుగుతువుంది. కార్లల్లో జీపుల్లో కార్యకర్తల హడావుడి, బయట బండ్ల మీద అరటి పళ్లు గెలలకు గెలలే అయిపోతు వున్నవి. ఎటు చూసినా గ్రౌండంతా వేరు శెనగ కాయల పొట్టే పొట్టు! మధ్యాహ్నం అన్నం పొట్లాళు లోపలికి వెలుతున్నాయి, లోపల ఓట్ల లెక్కింపు జరుగుతూనే వుంది

అక్కడన్నీ సోడాబుడ్లు, కూల్ డ్రింక్‌లు, చాయగ్లాసులు వాటి సందడిని అవి చేస్తూనే వున్నాయి

గంట, గంటకి జనంలో ఓ మాదిరి టెన్షన్ పెరుగుతూ వుంది లెక్కింపు రౌండ్స్ అవుతూ వుంటే జనం ముఖంలో రంగులు మారుతున్నాయి. హాల్ ముందు పెట్టి బోర్డ్ మీద ఎవరెవరికి ఎన్ని ఓట్లు వచ్చాయో రాస్తూనే వున్నారు. వచ్చే పోయే జనం చూస్తూ వున్నారు.

అక్కడ అన్నీ ఆశ్చర్యపు చూపులు, నవ్వు ముఖాలు, అంతే కాదు నోరు మూసుకునే వాళ్ళు నుదుటికి చేయి పెట్టుకునే వాళ్లు వచ్చిపోతూనే వున్నారు

ఎవరి ఓట్లు ఎవరికి పోయినయి !
ఏ పార్టీ ఓట్లు మరే పార్టీకి పడినయి !
సాయంత్రం అయ్యింది
కౌంటింగ్ ముగిసింది.

గెలిచినట్టు యిచ్చిన ధృవ పత్రాన్ని అందుకుని రాంరెడ్డి బయటికి వచ్చాడు అక్కడే నిలుచున్న శర్మగారు ఎదురెళ్ళి కరచాలనం చేసి అభినందనలు చెప్పాడు రాంరెడ్డి శర్మగారి కడుపు వద్ద తల వంచగ శర్మ నవ్వుతూ అతని తలను నిమిరాడు

రాంరెడ్డి గారి కార్యకర్తలు ఆయన్ను నేల మీద నడువ నివ్వ లేదు ఎత్తుకెళ్ళి జీపులో కూర్చోబెట్టి గెలుపు నినాదాలు చేస్తు వూరేగింపుగ తీసుకెళుతున్నారు శర్మగారు తన కార్యకర్తలతో జీపులో తమ పార్టీ కార్యాలయం వైపు వెళ్లాడు. ఆఖర్న హాల్లో నుండి బయటికి వొచ్చిన సత్యాజీ వెంట నలుగురైదుగురు కార్యకర్తలు వున్నారు మౌనంగానే వెళ్లి కారులో కూర్చున్నారు

కారు ఇంటి వైపు వెలుతువుంది మధ్యన చౌరస్తా దగ్గర రాంరెడ్డి ఊరేగింపు బాణాసంచాను పేలుస్తు, మేళతాళాలతో వెడుతూ వుంది. కార్యకర్తలు నినాదాలు చేస్తున్నారు, జనం గుంపులు గుంపులుగా రకరకాల నృత్యం చేస్తున్నారు బ్యాండు మేళం వాళ్లు హిందీ పాటను వినిపిస్తున్నారు, అందరి కంటే ముందు డప్పులు, కొమ్ములు.

ఓట్లు మనవి, సీట్లు మనవి అన్న చాల మంది ఆ

ఊరేగింపులోనే వున్నారు  కొందరు కోలాటం, మరి కొందరు చిడతల బజన, నుదుట కుంకుమ, వళ్లంతా బుక్క, నవ్వుతూ, త్రుళ్లుతూ జనం నడక

రాంరెడ్డి చిరు నవ్వుతో చుట్టు చూస్తూ చేతులు జోడించి అందర్కి నమస్కరిస్తున్నాడు  మధ్య మధ్యన పార్టీ కార్యకర్తలు, అబిమానులు పూలమాలలు వేస్తు వున్నారు  అక్కడక్కడ ఊరేగింపును ఆపి బాణా సంచాను కాలుస్తువున్నారు  రాంరెడ్డి తల వంచి అబివాదాలు చెపుతున్నాడు వున్నట్టుండి ఓ అబిమాని పూలదండ కాకుండా నోట్ల దండను తెచ్చాడు

రాంరెడ్డి కళ్లల్లో కొత్త కాంతులు, ఎంతో వినయంగా వంగి ఆ దండను మెడలో వేయించుకొని ఆ వేసిన వ్యక్తి భుజాలను నిమిరుతు, ఆప్యాయతతో చూశాడు

ఓట్లు, సీట్లే, కాకుండా నోట్లు గూడ రావడం చూసిన సత్యాజీ అసహనంగా కదులుతూ "డ్రైవర్ కారును మరో రోడ్డుకు మళ్లించు" అన్నాడు. కారు కొంత దూరం వెనక్కు వెళ్లి పక్క రోడ్డు వెంట పరుగెత్తుతూ వుంది

"ఓట్లు మావి - సీట్లు మావే" అన్న నినాదం పదే, పదే గుర్తుకు రాసాగింది

★ ★ ★

అది కాలేజీ ఆవరణ, ఒపెన్ స్టేజీ, దాని ఎదురుగా కుర్చీలు, స్టేజీ మీదికి వెళ్లడానికి మధ్య నుండి తోవను వదిలారు  పత్రిక వాళ్ళ కోసం ప్రత్యేకం

"రాష్ట్ర దళిత సాహితీ సభలు" అనే బ్యానరును వేదికపై కట్టారు అన్ని సాహితీ సభలకు వచ్చినట్టె జనం ఆ సభకు వచ్చారు సభాధ్యక్షులు, ఇతర కవి పండితులు సభను అలంకరించి వున్నారు సభా ప్రారంబాన్ని నేనే చేయవల్సి వుంది

"సబకు నమస్కారం, సబాధ్యక్షులు, వేదిక నలంకరించిన సాహితీ స్రష్టలు, మరియు సబలోని సాహితీ మిత్రులు, సోదరీ సోదరులారా, విద్యార్థులారా !

మనం ఆలోచనలను పంచుకోవడానికి ఈ సబలు జరుపుకుంటున్నాం ముందుగా మనం ఎటుపోతున్నామో పరిశీలించుకోవల్సి వుంది ఎటు పోవాలో ఆలోచించుకోవల్సి వుంది మన వెనకబడిన కులాల పితామహుడు డా॥ అంబేద్కర్ పొందు పర్చిన రిజర్వేషన్లు అందుకుంటున్నాం, అనుభవిస్తున్నాం కానీ ఆయన పిలుపును మరచిపోయాం, ఆయన ఆలోచనలను ఆచరించలేక పోతున్నాం

సభలో చప్పట్లు

"ఎడ్యుకేట్, ఆర్గనైజ్, ఎజ్‌టేట్"

ఎడ్యుకేట్ - నిన్ను నీవు తెలుసుకొని, నీ చుట్టూర వున్న వాళ్ల గూర్చి తెలుసుకొని మసలటం

చైతన్యవంతులను చేయటం

ఆర్గనైజ్ - దళితులంతా ఏకమై సర్వశక్తులను సమీకరించుకుని నడవమని, నలుగురితో కలిసి నడుస్తూనే మరి నలుగురు నీ

వెంట నడిచేట్టు నడువుమని.

ఎజిటేట్ - సిద్ధాంతపరంగా వాదోప వాదాలతో స్వార్థ సంస్కృతిని, ప్రకృతిని వ్యతిరేకిస్తు, సాంఘికన్యాయాన్ని సాధించడానికి, పోరాడమని

మరి సోదరులారా ? ఒక్కసారి ఆలోచించండి.

మనం ఎక్కడ ఆచరిస్తున్నాం, ఆ మహానుభావుడు చెప్పినట్టు మనం ఆచరిస్తే, మనల ఈ దుర్గతి ఎందుకు వెంటాడుతుంది ? ఈ దుస్థితి ఎందుకింకా మనలను అంటి పెట్టుకునే వుంటుందీ ఆలోచించండి !

మొన్న జరిగిన ఎన్నికల్లో అంబేద్కర్ ఆలోచనల స్ఫూర్తితోనే మనం ఒక కొత్త పార్టీని పెట్టుకుని ఎన్నికల్లో పోటి పెట్టింది ?

మరి రిజల్ట్స్ ? రాష్ట్రంలో ఒక్క అభ్యర్థైనా గెలిచాడా ? ఎందుకు? ఎందుకు?

"ఓట్లు మనవి - సీట్లు మనవి అన్నాం. కనీసం డిపాజిటన్న దక్కలేదే ! ఎందువల్ల ?"

"జాతీయ పార్టీ హవా" జనంలో నుండి కేక.

"అవును, హవాలకు నిలిచేదే ఐక్యత. నిజాయితీగల ఐకమత్యమే సోదరా ! అదే మన మధ్య కరువైందని అందుచేత మనం ఏం మాట్లాడు కుంటున్నామో, ఎటు పోతున్నామో ఒక్కసారి ఆలోచించమంటూ నాకీ అవకాశం కల్పించిన పెద్దలందరికి కృతజ్ఞతలు చెపుతూ శెలవు" అంటు ముగించాడు.

ఆ తరువాత ఓ అభ్యుదయ రచయిత మాట్లాడుతూ మార్క్సిజం ఒక్కటే దళితులకు మార్గమన్నాడు.

ఆ తరువాత ఓ విప్లవ కవి మాట్లాడారు. విప్లవ కవిత్వంలోనే దళిత స్పృహ వుంది అని, తమ కవితా సంకలనాన్ని కోటేశ్‌కు అంకిత మిచ్చాం అన్నాడు.

కొందరు యువకులు దళిత గీతాలు పాడారు రెండవ సమావేశం రేపు ఉదయం అని ప్రకటించారు.

అప్పటికి ఆ సమావేశం ముగిసింది.

# పనిష్మెంట్

రెడ్డిగారి భవంతి వచ్చే పోయే జనంతో కోలాహలంగా ఉంది. పైరవీలకు, పంచాయితీలకు, తీర్మానాలకు ఆ ఇల్లు ఓ వేదిక. సూర్యోదయంతో వచ్చిన మోతీ అలాగే గేటు పిల్లరును ఆనుకుని కూర్చుంది.

మోతీ ముఖంలో నిరాశలు గూడు కట్టుకొని ఉన్నాయి. ముడతలు పడ్డ ముఖంలో, జీవితంలోని కష్టాలకు గుర్తుగా నొసలుపై గీతలు అడ్డంగా ఉన్నాయి
కళ్ళలో ఏవో ఆశలు మిణుగురు పురుగుల్లా వెలుగుతున్నాయి. కొడుకు రాముడు హత్యచేశాడని న్యాయస్థానం రుజువు చేసింది. అతనికి ఉరిశిక్ష విధించింది ఆ ఆలోచనలతో మోతీ

గుండెలు బరువెక్కుతువున్నాయి. కొడుకులేని తన చివరి జీవితాన్ని ఊహించకోలేక పోతోంది.

కోర్టులో వకీళ్ళతో ఇక లాభం లేదని రాష్ట్రపతి క్షమాభిక్ష కోసం రాజారెడ్డి గారనే ఆ ప్రాంతపు యంయల్.ఎ.గారిని ఆశ్రయించింది.

వారి దర్శనం కోసం ఎదురుచూస్తువుంది. తనకున్న అయిదు ఎకరాల మెట్టపొలం అమ్మి యం.ఎల్.ఏ గారి దోసిట్లో పోసింది. కానీ అనుకున్నంత ఫలితం కనబడడం లేదు.

ఉరితీసే గడువు సమీపిస్తోంది. మృత్యు కుహ్వారంలోకి ప్రవేశించనున్న కొడుకు జీవితాన్ని తలచుకొని ఎంతగానో ఏడుస్తుంది. భరించలేని బాధ గుండెను పిండేస్తుంటే రెండేళ్ళ నుండి కంటికి నిద్రలేదు, కాలికి నిలకడ లేదు.

భర్త పోయాడన్న బాధ. కొడుకు చస్తాడన్న వ్యధ మోతీని కృంగతీస్తున్నవి.

ఇంతలో రాజారెడ్డిగారు పెళ్ళిపీటల మీదకెళ్ళే పెండ్లి కొడుకులా వరండాలోకి వచ్చాడు. పెదవులపై చిరునవ్వులు తొణికిసలాడుతున్నాయి. తెల్లని ఖద్దరు ధోవతి, సిల్కు లాల్చి అతని హుందాతనాన్ని చాటుతున్నాయి.

రాజారెడ్డిని చూడగానే దేవుణ్ణి చూసినంత పనయింది మోతీకి. అంతవరకు ఆపుకున్న దుఃఖం ఒక్కసారి పెల్లుబికింది.

"దొరా! ఖర్చులకు భయపడకండి, మిగిలిన ఆ చెలకనైనా అమ్మి నా కోడుకు ప్రాణాలు నిలబెట్టండి. ఎట్లాగైనా వాడు

బ్రతకాలి" అంటూ తన నిశ్చయాన్ని వెలిబుచ్చింది.

కేసును ఆలోచిస్తూ సిగారు వెలిగించాడు ప్రజానాయకుడు.

మోతీ ఇంకా తన గోడును వెల్ల గక్కుతూనే ఉంది. "వాని శని మూడింది వాడి తండ్రిని వాడే సంపుకున్నాడు. మందినేమైనా సంపిండా?" అంటూ "లా"కు దొరకని పాయింటుతో ఏడుస్తూ మాట్లాడుతు వుంది.

అది విన్న రాజారెడ్డి "తను చావడానికి కూడ చట్టం ఒప్పుకోదు. అది హత్య అయినా, ఆత్మహత్యయినా నేరం, నేరమే శిక్ష తప్పదు" అన్నాడు.

"సచ్చిన ముసలోడు ఏలాగో సచ్చిపాయె! కనీసం ఈడన్నా బతకాలి కదా ! పెండ్లాం ఏడ్చి, ఏడ్చి సగం అయ్యింది. ఆని అత్తగారోళ్ళు గూడ కొంత డబ్బిస్తమంటున్రు. ఏదన్న సేసి నా కొడుకు ప్రాణం కాపాడు దొరా! నీ ఆకిలి వూకి, నా రుణం తీర్చుకుంటా" అంటూ మోతీ వెక్కి వెక్కి ఏడుస్తు వుంది.

అప్పుడే అక్కడికొస్తున్న కోడల్ని చూపిస్తూ – "అదిగో అది కూడ వస్తుంది. దాని ముఖం చూడు దొరా! అది కుమిలి కుమిలి ఏడ్చి సస్తుంది. అది కాపురానికొచ్చి కొద్దిరోజులైనా కాలేదు. వాడేమో జైలు పాలయ్యిండు. ఆనాటి నుంచి దాని కంటికి కునుకులేదు. దాని మొఖం సూసైనా సరే, ఆని పాణం కాపాడండి."

నేలను చూస్తూ ఏడుస్తున్న కోడలు లచ్చిమి దగ్గరికెళ్ళి తల నిమురుతూ-

"ఊర్కో-ఊర్కో-దొర ఎలాగైనా నీ పసుపు కుంకుమ కాపాడుతాడు, ఏడవకు" అంది

రాజారెడ్డి ఆమె వైపు చూస్తూ, ఇంత చిన్న వయసులో వచ్చిన ఆపదను ఆలోచిస్తూ, సిగార్ దమ్ము లాగి పొగను గాలిలోకి వదిలాడు.

"ఇంకా ప్రయత్నం చేద్దాం-రేపు ముఖ్యమంత్రిని కలుద్దాం ఆయన ద్వారా ఢిల్లీకి ఫోను చేయిద్దాం ఈ సారి తప్పకుండ అవుతుంది"

రాజారెడ్డి మాటలకు మోతీ ప్రాణాలు లేచివచ్చినయి కోడలు కళ్ళలో కొత్తకాంతులు వెలిగినయి. మోతీ, రెడ్డి కాళ్ళకు మొక్కుతు వుంది కోడలు లచ్చిమి కొంగుతో కండ్లను తుడుచుకుంటుంది

లచ్చిమికి పాతికేండ్లు. పసుపుపచ్చ రంగు, నల్లని కళ్ళు, తెల్లని పళ్ళు, రెడ్డి చూపులు తడబడ్డాయి.

మనసులో ఏదో కదిలింది

సిగారును నేలకేసి విసిరి, మోతీని దగ్గరికి పిల్చి చెవిలో ఏదో చెప్పాడు రెడ్డి.

"అమ్మో! వద్దు దొరా?" అంటూ నోరు మూసుకుంది. మళ్ళీ చెప్పాడు రెడ్డి.

"అమ్మో! అది నాతో కాని పని దొరా!" అంటున్న మోతీకి

వణుకులాంటిది మొదలయ్యింది

రాజారెడ్డి పెదాలపై ఓ మాదిరి నవ్వు నాట్యం చేసింది

"ఇది మాత్రం నాతో అయ్యేపనా?"

ఆ మాటలకు మోతీ కొంతసేపు రాయిలా నిలబడింది.

"అప్పటికి పైకం తీసుకొని వస్తా!" అంటూ కోడలితో వెళ్ళిపోయింది

దారిలో రెడ్డిగారు తన చెవిలో చెప్పిన రహస్యాన్ని కోడలు చెవిన వేసింది. అప్పుడు మోతీ కాళ్ళు వణికినయి నాలికపై తడి ఆరి మాటలు తడబడ్డాయి. అది విన్న లచ్చిమి బొమ్మలా నిలబడింది. అలా నిలబడ్డ లచ్చిమి కళ్ళనుండి ఏకధారగా కన్నీరు జారుతు వుంది. "భగవంతుడా! నన్ను ముందు చంపు" అన్నప్పుడు ముక్కుపుటలు కదిలి వేడిశ్వాస బయటికొచ్చింది.

"ఆయన ఏలాగూ సస్తడు. నేనూ సస్త కానీ ఈ పని సేయలేను."

"ఎవ్వరూ సావకూడదు. ఇద్దరూ బతకాలి- అందుకే" మోతీ అనుకోని నిబ్బరంతో అంది.

"ఎట్లా బతికేది, ఏం సేసేది? ఆ తర్వాత ఈ ముఖం ఎట్లా సూపేది-ఈ కుంపటి ఎట్లా భరించేది?"

"బతకాలి - భరించాలి. నా భర్తను నీ భర్త సంపినా నేను కోర్టులో సంపలేదని సాక్ష్యం ఇవ్వలేదా?"

"ఆయన మాత్రం సంపాలని సంపిండా? ఏదో మాటమీద

మాట పెరిగి, పెద్ద జగడమైంది''

"ఏది ఏమైనా సంపిండా లేదా? కోర్టులో అబద్దం సెప్పినా సెప్పలేదా?''

"అది నీ కడుపు తీపి. అయినా నాకు సెప్పు, నీకు నోరెట్లా వచ్చింది?'' అంటూ కుడిచేతితో తన నోరు మూసుకుంటూ ఏడుస్తు వుంది

"ఆ . ఆ కడుపు తీపే...ఆ నోరే . అదే నా భర్తను సంపినా సంపలేదన్న ఆ నోరే, ఈ రోజు సెప్పేది''

"ఆపు అత్తా . ఆపు'' అంటూ లచ్చిమి ఏడుస్తు వుంది

"కానీ.. కానీ.. ఒక్కసారి ఆయనను సూసి వచ్చినంక''

"ఎందుకు-ఈ విషయం వానితో సెపుతావా ఏం?''

"లేదు! ఆయన్ని సూసి వస్త! అంతే''

★ ★ ★

జైల్లో విజిటర్సు గది

గది బయట జవాను.

గదిలో రాముడు, లచ్చిమి చుట్టూర భయంకర నిశ్శబ్దం ఇద్దరి కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి.

"అత్త-రెడ్డిగారితో మాట్లాడింది'' అంటూ లచ్చిమి కళ్ళనీళ్ళు కార్చడం మొదలు పెట్టింది.

"ఏమన్నాడు?'' రావుడు.

"తప్పక ఇడిపిస్తానన్నాడు, కానీ-''

"పైకం కావాలన్నాడా?"

"సెలకనమ్మి పైకం ఇస్తమన్నాం. ."

"మరి.. "

".. "

"సెప్పు ."

ఎలా చెప్పుతుంది? ఏమని చెప్పుతుంది? ఏడ్వటం తప్ప..

"చలో.. చలో.. టైమ్ హెూగయా..." జైల్ జవాను విదిలింపు.

"ఏదడిగినా ఇచ్చెయ్యండి ఎంతడిగినా ఇచ్చెయ్యండి చెలక . బావి. ..అన్నీ. ."

"కాదు.. అవన్ని కావు..." అంటూనే నేలను చూస్తోంది కడుపులో కదిలిన దుఃఖం కనురెప్పలను తన్నుకొస్తుంది

"నేను బతకాలి ."

"చలో...చలో బాహర్ చలో..."

రావుడు జైల్లోకి, లచ్చిమి బయటికి నడిచారు.

★ ★ ★

పట్టణంలో అధునాతనమైన హెూటల్ గది. చాలా అందంగా విలాసంగా ఉంది మెత్తని డన్‌లవ్ బెడ్‌పై తెల్లని బెడ్‌షీట్ పాలమీగడలా ఉంది. లచ్చిమి వలలో చిక్కుకున్న లేడిలా బెదురు బెదురుగా అదే బెడ్ పై కూర్చుంది

ఎదుటి సోఫాలో కూర్చున్న రాజారెడ్డి, కాలుతున్న సిగరెట్టును యాష్ట్రేలో నలిపి వదలి, వెళ్ళి లచ్చిమి ప్రక్కన కూర్చుంటూ "అబ్బ! దిరిసన పువ్వులా ఉన్నావ..." అంటూ లచ్చిమి దగ్గరికి జరిగి కూర్చున్నాడు.

లచ్చిమికి గుండె వేగం హెచ్చినట్లయింది రెండు చేతులతో ఆమె గుండెను అదిమి పట్టుకుని, మంచపు మూలన వొదిగిపోతు, తనపైకి వస్తున్న రెడ్డినే చూస్తూ వుంది అప్పుడామెకు వంటిలోని నరాలు మొద్దుబారుతున్నట్లు, గుండె గడ్డకట్టినట్లు అనిపించింది

"ఎయ్ ఎందుకట్ల బెదిరిపోతావ యిక్కడ ఎవరు రారులే!"

ఆమె రెప్పవాల్చకుండ అతన్నే చూస్తూవుంది. ఆయన అన్న మాట ఆమె చెవికి తాకినట్టులేదు కాని అతని చేతులు ఆమె భుజాలను తాకినట్టు అనిపించింది.

కళ్ళల్లో భయం, చూపుల్లో బెదురు, శ్వాసలో బాధ, వంటిలో వణుకు, కనురెప్పలు కొట్టడం మానేశాయి.

ఆమె మనసులో అత్తా - భర్త రూపాలు కదిలాయి

"ఎవ్వరు... సావకూడదు" అత్త

"నేను బతకాలి" భర్త.

బాధగా తలెత్తి చూసింది. వెలుగుతున్న ట్యూబ్లైట్ దగ్గర ఎగురుతున్న ఓ చిన్న మిడతను ప్రక్కనే పొంచి ఉన్న బల్లి నోటకరచి పట్టింది.

ఆయన లచ్చిమిని కసిగా తన కౌగిట్లో అదిమి పట్టాడు.

బల్లి నోటిలో ఉన్న మిడత గిలగిల తన్నుకుంటు వుంది.

అతని కౌగిలిలో ఆమె భయంగా, బాధగా శ్వాస వదులుతు వుంది.

బల్లి మిడతను చిదిమి-చిదిమి మింగింది.

★ ★ ★

వారం గడిచాక ఓ ఉదయం రావుడిని ఉరి తీశారు

ఆ వార్త విన్న మోతీ, ఏడ్చి, ఏడ్చి మూగయింది.

లచ్చిమి మాత్రం ఏడవడం లేదు నవ్వుతూ ఉంది.

★ ★ ★

కొన్నాళ్ళ తర్వాత మళ్ళీ ఎన్నికలొచ్చాయి. తండలోని గిరిజనులను ఉద్దేసిస్తూ రెడ్డి-

"నేను రావునికి ఉరిశిక్షను తప్పించాలని, హైద్రాబాదు, అంతేకాదు ఢిల్లీకి తిరిగి తిరిగి ప్రయత్నించినా, ఫలించలేదన్న విషయం మీ అందరికీ తెలుసూ-"

అంతలోనే ఓరాయి వొచ్చి రెడ్డి తలకు తగిలింది 'అమ్మో' అంటు కుప్పకూలాడు 'రాయి ఎటునుండి వొచ్చింది? చుట్టూర జనం చూపులు. పోలీసుల ఉరుకులు పరుగులు

**ఆంధ్రప్రభ**

**వారపత్రిక**

# లేకి బతుకులు

అరవై ఏండ్ల చంద్రమ్మ చూడడానికి డెబ్బై ఏండ్ల కొడవలిలా కనిపిస్తు వుంది. ముసురుకు తడిసి ఎండిన పత్తి పూవులాంటి తల, జీవకళలేని చూపుతగ్గిన గవ్వ కళ్ళు, ఎముకలకు అంటుకపోయి ముడుతలు పడ్డ చర్మం. వెలసిన ఆదోమాదిరి నలుపు రంగు. ఏదో పని చేస్తేనే కాని పూట గడవని పరిస్థితి. సర్కారు వారి సహాయం ఆమెకు అందనే అందలేదు. మాలవాడలో నివసిస్తున్న మట్టి మనిషి ఆమె.

అది వరికోతల కాలం. కొడవళ్ళు పట్టుకుని జనం బావుల వైపు నడుస్తున్నారు. వాళ్ళల్లో చంద్రమ్మ ఒకతి. పొద్దు బారెడెక్కింది అందరు బావి దగ్గర నిలుచున్నారు.

గుత్తకు యివ్వమని కూలీలు-

లేదు కూలీకే పనిచెయ్యమని రామిరెడ్డి కొడుకు శీన్‌రెడ్డి పనగలి దగ్గర నిలుచోని పనిచేయగలిగిన వాళ్ళను పొలంలోకి పంపిస్తు వుంది, శీన్‌రెడ్డి భార్య సుశీల.

మొదట రెండు మళ్లు కొయ్యంగానే మెదను పక్కకు పెట్టిస్తే రాలిన రాగి ఆకులను పనికి రాని గడ్డి పోచలను ఏరేస్తే కళ్ళం చెయ్యొచ్చు అని భార్యతో చెప్పి కూలీల వైపు నడిచాడు.

మందిలో అకర్న వొచ్చిన చంద్రమ్మను ఆపి-

"నీకేం చేతనైతదే రెక్కాడిచ్చి కోయలేవు. కొట్టలేవు'. అంది

"అదేం దొరసాని యియ్యాలేం కొత్తంగ కోస్తున్ననా కలుపు, కోత, కల్లం అన్ని సేసి సేసి ముసల్దాన్ని అయిన"

వేలితో కొడవలి పదును తాకి చూస్తూ అంది.

'చేసినన్ని రోజులు చేసినవు చేతగాకుంట అయినంక యింకా చేస్తవా"

"మరిపూట ఎట్లా ఎల్‌తది నీ కాల్మొక్తా"

"నీవు కొయ్యలేవు. జరసేపు అట్ల కూర్చో" అంటు తడిక వేసుకుని వరి మళ్ళ వైపు నడిచింది. సుశీలకు పాతికేండ్లు వయస్సు లక్షణమైతే నేమి ఉన్న యింట్ల పుట్టిన ప్రభావం అయితేనేమి సుశీలలో ఓ మాదిరి నిర్లక్ష్యవైఖరి, ఆమె మాటల్లోను నడకలోను కొట్టొచ్చినట్టు కనిపిస్తూ వుంది."

పనికొద్దనగానే చంద్రమ్మ మనస్సు చిన్నబోయింది. గుండెలో కదిలిన నిరాశను బరువైన శ్వాస ద్వారా వొదులుతూ, మౌనంగ

వెళ్ళి పక్కనే ఉన్న రావి చెట్టు మొదలును ఆనుకుని కూర్చుంది.

చంద్రమ్మ కొడవలితో భూమి మీద కాట్లు పెడుతూ "భూదేవి నీకింత సాకిరి సేస్తే ఏం మిగిలింది?

బావితోడితే ఏమొచ్చె-
పొలం అచ్చుకడితే ఏమొచ్చె-
సేనుకాస్తే ఏమొచ్చె-
పంట ఎవరి గరిస జేరే-
పాడి ఎవరి యిల్లు జేరె

ఐదేండ్ల పిల్లపుడు ఈ వూరికి కోడలై వచ్చిన నాటినుండి నేటి వరకు ఈ వూరి అన్ని బావుల దగ్గర నాటేసి, కోసి, కొట్టి పుట్లకు పుట్లు పోగుసేస్తే ఏపూటకు ఆ పూటే నాయె- ఏం బతుకులు ఈ ఆకలి బతుకులు. సేసుక బతికే వయసులనే సస్తే బాగుండు. అనుకుంటు బావి వైపు చూసింది. ఒకప్పటి రోజులు గుర్తొచ్చి గతంలోకి వెళ్ళింది.

ఆరోజుల్లో రామయ్య పటేలు,
రెండెకరాల సెలకను తీసుకొని బావి తవ్వించిండు. మొదట గడ్డపార వేసింది. నా పెనిమిటి రాములు, తట్టమోసింది నేను. నీళ్ళు పడగానే దోసిల్లతో పైకి చల్లిందీ నేనే, ఆ తరువాత ఆయన అక్కన్నే జీతం కుదిరె. నామొగుడు మోటతోలి పొలం పారిస్తేనే కదా! పుట్లు పండి రెండెకరాలు పోయి ఈ రోజు

పదెకరాల పొలం అయ్యింది. మొదట జత ఎడ్లతో మొదలై యియ్యాల ఐదారు జతల ఎడ్లు, ఆవులు, బర్లు! మోటలు పోయి, ఆయిల్ ఇంజన్ వచ్చె. అది పోయి కరెంటు మోటరొచ్చె. ఇప్పటి మొగోల్లకు మోటల బాదే లేదు. ఆరోజుల్లో ఆలుమొగలకు రాత్రింబగల్లు బాయి, పొలం పనేనాయె. ఆయనతో పాటు పనిచేస్తూ వుండేది. రామయ్య పటేలు పెండ్లాం సీతమ్మ. తనను ప్రతి పనికి పిలుస్తూ వుండేది ఎంత జేసిన తిండి గుడ్డ అంతకంతకే. నొప్పులు రోగాలకు అప్పులే! మాకు పిల్లలు కలగలేదని కనపడ్డ దేవుల్లకు మొక్కుకుంటిమి. మంత్రాలు, తంత్రాలు దేవుళ్ళు, దయ్యాలు ఒక్కటేమిటి తిర్గి తిర్గి పానంఏసారె ఒకరోజు ఆయనతో–,

'అందరు పట్నమో, బొంబాయో పోయి మంచిగ బతుకుతుండ్రు మనం గూడ పోదాం, లేదా కులవృత్తి గుడ్డలు నేసే బతుకుదాం అంటె యినక పాయె.

సెమటోడిసి నేసినా అప్పేమిగిలే'' అనుకుంటు బావి వైపు చూసింది ఒక్కసారె కళ్ళల్లో నీళ్ళు తిరిగినయి. రాగి చెట్టు మొదటి నుంచి లేచి బావి వైపు నడిచింది. ఆ వొట్టి మొత్తలు చూడగానే మోటలు గుర్తొచ్చెసరికి చంద్రమ్మ మెదడు మొద్దుబారి పోయింది. ఒకరోజు ఈ బావి మోటకూలి మోటకొడుతున్న తన భర్తముందు పైన మోట–! అట్ల తన పసుపు కుంకుమ రేపున కలసి బ్రతుకు బండలపాలాయె. కళ్ళలో నీళ్ళు తిర్గినయి బావి కనపడకుండ మసకలు కమ్మినయి. వొడ్డున

కూర్చొని మనసారా ఏడుస్తూ వుంది. అప్పుడు ఆమె చేతులకున్న రాతెండి గోట్ల మీద కన్నీటి బొట్లు రాలుతున్నాయి. చంద్రీ, ఓ చంద్రీ, కోస్తున్న మళ్ళ మధ్య నిలుచున్న సుశీల పిలుపు. కన్నీళ్ళను చినిగిన చీరకొంగుకు అద్దుకుని మొదటి మడివైపు కదిలింది. ఈయ్యాల రామయ్యపటేలు లేడు సీతమ్మ లేదు. ఇది కొత్తతరం ఆస్తులినే సూసుకుంటుండ్రు కాని అది ఎట్లా వచ్చింది. ఎవరికి కావాలె! సేసేది ఒకరు దోసేది ఒకరు.

"ఓచంద్రీ, రావే, రా. ఈ మెదలు తీసిన మళ్ళలో రాలిన రాగాకును ఏరేసి అట్టనే పరిగేరుకో" అంది.

సరే అన్నట్టు తలవూపి మొదటి మళ్ళో వంగి రాగి ఆకులను ఏరసాగింది. తలనిండా గత కాలపు జ్ఞాపకాలు.

ఈ మళ్ళు అచ్చుకట్టినపుడు పెనిమిటితో పాటు తాను వరాలు పేర్చింది. అరచేతులతో అదిమి చదును చేసింది. అప్పటినుండి పోయినేడు వరకు వరినాటు వేయడం కోతలు కోయటం, మోయటం, కొట్టటం, రాసులు పోయటం, కూలి గింజలు తీసుకుని పోవటం జరుగుతూ వొచ్చింది. పొలాల్లో నీళ్ళతోపాటు తమ రక్తం చెమటవలె పారింది. ఈనాడు సేతకాని దానివని పని సేయలేవని పనికి రావద్దంటుండ్రు. ఈ వూరిని ఈ భూమిని నమ్ముకున్నందుకు కూడు–గుడ్డ కరువైంది. ఎన్నడూ కడుపునిండా తిన్నదిలేదు. కంటినిండా నిద్రపోయింది లేదు. పొద్దు వొరిగే వరకు రెండు మళ్ళలోని రాగి ఆకులు ఏరి

కుప్పపోసి, ఏరిన పరిగె పనలను కట్టలు కట్టి వరంమీద పెట్టి పక్కన నిలుచుంది

చివరి పొలంనుండి వచ్చిన సుశీల:

"ఏమే ఏరటం అయ్యిందా"

అయ్యిందమ్మా అన్నట్టు తల వూపింది. కూలికి రానియ్యకున్న పరిగ ఏరుకో నిచ్చినందుకు సంతోషంగానే వుంది.

"ఆటిని అక్కడ వుంచి రేపురా, వొచ్చి యిన్ని గింజలు అడకపో".

ఏరిన పరిగ పది శేర్లన్నా అవుతయి. ఏరుకొమ్మని వుంచి పోమ్మంటదేమిటి? అనుకుంటు బిత్తరపోయి నిలుచుంది. నోటిలో తడి ఆరిపోయింది. కళ్ళం చేయటానికి తొందర, తొందరగ మెదలను లేపటం వల్లా పనలన్ని పడిపోయినయి. లేకపోతే రెండు మల్లల్ల గంత పరిగా పట్టుకపోయి ఆ మెదలల్లా కలుపు." నడుంకు చేతులు ఆనించి శాసించినట్టు అంది

'ఏరనైతె ఏరిన మీదయ, ఎక్కడైన ఏరుకున్నోల్లకే పరిగ"

'అట్లయితే సగం తీసుకపో సగం అక్కడ పెట్టు' అంటు బావివైపు నడిచింది. చేసేది లేక చంద్రమ్మ చూస్తు నిలుచుంది. అంతకు ముందున్న సంతోషం ఆవిరైపోయింది. పొద్దు గూకే వేళ్ళ, చేసేది లేక మట్టిలో రాలిన వడ్ల గింజల మీద చంద్రమ్మ చూపులు ఆగినయి. పొద్దున్నే వొచ్చి ఆ లేకినన్నా వూక్కొవాలి.

ఊసేసినంక వాటిని సగం యివ్వమంటదో ఏమో! ఏరిన పరిగ తనకు పూర్తిగ దక్కలేదు! ఈ లేకి అన్నా దక్కుతదో! అయిన లేకిని అడుగుతర, అడుగరులే, అనుకుంటు ఏరిన పరిగెను మెద పక్కమ్మటే పెట్టి బావి వైపు నడిచింది.

★ ★ ★

పొద్దుపొడిచే వరకు చంద్రమ్మ చాట-పొరకతో పొలం వైపు నడిచింది. అప్పటికే యిద్దరు ఆడవాళ్ళు నిన్నటి రెండు మళ్లని పేడతో అలుకుతూ కళ్ళం తయారు చేస్తువున్నారు

మళ్లలో తాను నిన్న చూసిన వడ్ల గింజలు లేవు! ఆ రాత్రి రెండు మళ్ళను పశువులతో తొక్కించినపుడు మట్టిలో కలిసి పోయినయి చంద్రమ్మ నిరాశతో నిట్టూర్చుతూ చుట్టు చూస్తు నిలుచుంది. కోసి పేర్చిన మెదలమీద పిట్టలు, కాకులు వాలి గింజలను ఏరుక తింటున్నాయి. కొంగలు మాత్రం వొరాల మీద తిరుగుతు, తడివున్న చోట చేరిన తలకప్పలను, చేప పిల్లలను పొడుచుక తింటువున్నయి

కళ్ళం అలుకుతున్న తోటి స్త్రీలు చంద్రమ్మను రమ్మని సైగ చేయగ తాను నిన్న ఏరిన పరిగ తొనల వైపు నడిచింది చంద్రమ్మ తలనిండా ఆలోచనలే -

యిగ తనను పనికి ఎవ్వరు, రానివ్వరు! రేపో మాపో సస్తే పిండాకూడు కోసం కొన్ని, బియ్యం కావాలి- పరిగ గింజలనన్నా అట్టనే దాసి వుంచుకోవాలి. యిగ కన్నుమూసేకాలం

దగ్గరొచ్చింది" అనుకుంటు అతి కష్టంగ అడుగు తీసి అడుగు వేస్తూ నడుస్తూ వుంది.

ఆమె అడుగుల కదలికకు కప్ప పిల్లలు, మిడతలు పక్కలకు పరుగెడుతు వున్నయి పైన గద్దల గుంపు తిరుగుతూ తిరుగుతు వుంది.

డిసెంబర్, 1995.